# శ్రీ సుంకర కనకారావు

ఉద్యమకారుడు, ఉత్తమయోధుని 60 సంవత్సరముల జీవిత చరిత్ర

13-10-1923 నుండి 13-10-1994

## 72 జన్మదినోత్సవ ప్రత్యేక సంచిక

వేదిక :

అనుపమ కాన్ఫరెన్సు హాలు, విజయవాడ





సంకలనకర్త

**బూదరాజు శ్యామసుందర్** B.A., ABTI(London)

ముద్రణ కాలం :
1994 అక్టోబరు 13

ప్రతులు : 1000

ప్రతులకు :
సుంకర కనకారావు
ఆనందభవన్, సత్యనారాయణపురం
విజయవాడ-520 011
ఫోన్ : 432091

వెల : రు. 50/-

DTP:
'ప్రింటిక' విజయవాడ
ఫోన్ : 430876

ముద్రణ :
శ్రీ అరుణోదయ ఆఫ్‌సెట్ ప్రింటర్స్
సీతారామపురం, విజయవాడ-520 002
ఫోన్ : 431422

శ్రీ సుంకర కనకారావు, ఉద్యమకారుడు, ఉత్తమయోధుని

60 సంవత్సరముల జీవిత చరిత్ర

విజయవాడ, 13/10/94



# నా మనస్సు

"జాతస్యహి మరణం ధృవం" అని పెద్దలు చెప్పేమాట అయితే మంచివాడుగా ప్రసిద్ధికెక్కి తుదిశ్వాస విడిచినవాడు అదృష్టవంతుడు "అనాయాసేన మరణం, వినాదైన్యేన జీవనం" అనేది గూడ సుప్రసిద్ధ ఆర్యోక్తి దేనికీ దేబిరించకుండా జీవన వ్యవసాయం చేసినవాడు, మంచానపడి తీసుకుని చావకుండా, గుట్టుక్కు మని మరణించినవాడు మరింత అదృష్టవంతులు. "కారే రాజులు రాజ్యముకగలుగరే, గర్వోన్నక్ బొందరే, వారేరీ సిరిమూట గట్టుకుని బోవంజతరే, భూమిపై బేరైనక గలరే, ..... శిబి ప్రముఖులున్ ఈరే కోర్కుల వారలన్మరచిరే అని, పోతనామాత్యుడు భాగవతంలో బలిచక్రవర్తి చేత అనిపిస్తాడు.

అలాగే నేను కోరుకునేది గూడ, దైన్యంలేని జీవనం, అనాయాస మరణం, అదీ పదిమందికి చేతనైనంతలో మేలు చేస్తూ, నిస్వార్థంగా జీవిచడం. భగవంతుడు కరుణామయుడు. మంచి చేసిన వారికి కొంతైనా మంచి చేస్తూనే వుంటాడు.

నా జీవిత కాలంలో పదిమందికి ఉపయోగపడ్డాననే నా నమ్మకం జీవితంలో నేను పెద్ద పెద్ద పదవులు అధిష్టించకపోవచ్చు లక్షలు, కోట్లు ఆర్జించకపోవచ్చు కానీ తిండీగుడ్డలకు ఈనాటికీ లోటు లేకుండా జీవించగలగడం, చిన్న ఇంట్లో నివసించగలగడం భగవంతుని కరుణ కాకపోతే, నా గొప్పదనమా?

చిన్ననాటి నుండి అయిదుగురు అన్నదమ్ముల ఆధ్వర్యంలో పెరిగాను వారి ప్రోత్సాహం, ఆదరణ, వాత్సల్యం నాకు వెన్న తినిపించింది పలువురు మిత్రులు, సహచరులు అడుగడుగునా నా ప్రక్కనే నిలిచి వారికి చేతనైనంత సహాయ సహకారాలు అందించారు వారందరికీ ఈనాటికీ కృతజ్ఞుడ్నే.

భగవానుడు నాకు ప్రసాదించిన వరాల్లో, మరింత ముఖ్యమైనది మరొకటి. సేవా దృక్పథంతో జీవించగలగడం రాజకీయాల్లో గాని, విజయవాడ పట్టణ అవసరాలు గుర్తించి రైల్వేస్టేషన్‌ను గొప్పగా తీర్చి దిద్దడంలోనూ, మాంగో మార్కెట్ నిర్మాణం కార్యక్రమాలలోనూ, రేడియో, టి.వి. స్టేషన్‌లు నెలకొల్పడంలోనూ, మరింతగా సాంస్కృతిక, కళారంగాల్లో అరుణోదయ సంగీత నాట్యమండలి, హిందూస్తాన్ సంగీత మండలి, నేషనల్ ఆర్ట్ థియేటర్‌ల ద్వారా పలువురు ప్రసిద్ధ కళాకారులను సన్మానించగలగడం, వర్ధమాన కవులు కళాకారులను సినీ రంగంలోకి అడుగు బెట్టించగలగడానికి కారణభూతం కావడం, ఇవన్నీ భగవత్కరుణకు నిదర్శనాలు కావా? అందుకని ప్రప్రథమంగా భగవానునికి, విజయవాడ నగరంలో జన్మ నిచ్చిన మాతా కనకదుర్గకు నా నమోవాకాలు.

నా మాట మీద నాతో కూర్చుని నా జీవిత చరిత్రను గ్రంథస్తం చేసిన చి॥బూదరాజు శ్యామ్‌సుందర్‌కు, కోరినంతనే సభకు విచ్చేసి ఆశీర్వదించడానికి సంసిద్ధులైన శ్రీ ఆచార్యబేతవోలు రామబ్రహ్మం, డా॥ ఇంటూరి వెంకటేశ్వరరావు, తుర్లపాటికుటుంబరావు, డా॥ చివుకుల సుందరరామశర్మ, జన్మదిన సన్మానకర్త శ్రీ డొగిపర్తి శంకరరావు, సూవెనీర్ విడుదల చేసిన శ్రీ డి నారాయణరావు, దేశముఖ్, మీదు మిక్కిలి సభాధ్యక్షత వహించిన శ్రీ జి ఎస్ రాజు, ముఖ్య అతిథి ఎం ఆర్ అప్పారావు గార్లకు నా మనఃపూర్వక కృతజ్ఞతలు. సొవేనీర్‌ను సర్వాంగసుందరంగా రూపొందించిన శ్రీ సి హెచ్ రమేష్ (ప్రింటికా) కు, అతని సిబ్బందికి నా ఆశీస్సులు. శ్రీ యస్వీ. శేషగిరి రావు అరుణోదయ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ వారికి నా అభివందనాలు.

భవదీయ

సుంకర కనకారావు

*Freedom Fighter, Social Worker, Cultural Promotor & Sr. Congressman*

## KALA PRAVEENA SUNKARA KANAKA RAO

### 72 BIRTHDAY CELEBRTIONS COMMITTEE, VIJAYAWADA

Dr. N. Satyanarayana
President - M.B.B.S., F.C.G.P., A.F.I.M.S., F.I.A.M.S
Sri Dogiparthy Sankara Rao
Vice President
Sri K. Bhagawan Dass
Secretary
Sri Achanta Venkataratnam Naidu
Sri R. D. Shah
Sri R. D. Kishore
Sri Dhara Satyanarayana Sarma
Sri U. Visweswara Rao
Sri Budiraju Syamsundar
Sri Rentala Gopalakrishna
Sri A.G.M. Somayajulu
Sri P. Mukhyaprana Rao
Sri Kameswara Rao







# శ్రీ కనకారావు చరిత్ర నేనెందుకు వ్రాశాను!

ఒక రోజున అంతా రాసిం తరువాత నన్ను నేను ప్రశ్నించు కున్నాను. ధనం కోసమా? ఉత్త స్నేహం కోసమా? ఏదైనా పదవి యిప్పిస్తాడని ఆశా? వీటిలో ఏ ఒకటి నన్ను ప్రలోభ పెట్టలేదు.

వయసులో నాకన్నా పెద్దవాడు. కళాసేవలో గూడా నా కన్నా చాలా గొప్ప సాధకుడు. దాదాపు మా యిద్దరి అభిరుచులు ఒక్కటే. ఒక వ్యక్తి ని స్వార్థంగా (పోనీ కొన్ని గౌరవ పదవులు లేదా గౌరవం పొందుదామనే అంతర్గత వాంఛతో కావచ్చు). కళారంగానికి, సంగీత, నాటకరంగాలకు చేసిన సేవ, విజయవాడ నగర సాంస్కృతిక ఎదుగుదలలో చాలా పెద్ద భారాన్ని మోసి, మిక్కిలి ఔచిత్యంతో గూడిన పాత్ర నిర్వహించినందుకు - శ్రీ కనకారావును గురించి పదిమంది ఈ తరంవారికైనా తెలిస్తే, మరికొందరు కనకారావులు, విజయవాడలో, లేక ఆంధ్రప్రదేశ్ మరే ప్రాంతంలోనైనా ఉద్భవిస్తారేమోనని చిన్న ఆశ నన్నా పనికి పురికొల్పింది.

బందరులో (మచిలీపట్నంలో) ఆంధ్రసారస్వత సమితి వ్యవస్థాపకుల్లో ఒకడుగా పదేళ్ళు, ఆతర్వాత స్పందన సాహితీ సమాఖ్య కార్యదర్శిగా, ఉపాధ్యక్షుడుగా, కన్వీనర్‌గా, అధ్యక్షుడుగా మరో 18 ఏండ్లు సాహితీరంగానికి నాకు చేతనైనంత సేవ చేసే అదృష్టం నాకు లభించింది. కష్టనష్టాలు, అనేకంవుంటే వుండుగాక. ఆంధ్రప్రదేశ్, ప్రవాసాంధ్రులను గూడ ఆహ్వానించి, జిల్లాస్థాయి, రాష్ట్రస్థాయి రచయితల సభలు, కవిసమ్మేళనాలు అనేకం నిర్వహించాం. దాదాపు 75 కు పైగా, పలురచయితల పుస్తకాలు (ప్రచురణ సంస్థలు వాణిజ్య పరమైన పుస్తకాలే వేస్తాయి కాబట్టి) లాభార్జన దృష్టి లేకుండా సంస్థ పేర వెలుగులోకి తెచ్చాము. అవన్నీగతం. ఆగతం మరిచిపోబోతున్న రోజుల్లో శ్రీ సుంకర కనకారావును ఒక పత్రిక కోసం ఇంటర్వ్యూ చేయాల్సి కలిసాను. అదో అనుబంధం. ఆనాటి నుండి మేమిద్దరం మంచి మిత్రులం. శ్రీ సుంకరను గురించి "ఉపన్యాస కేసరి" శ్రీ తుర్లపాటి కుటుంబరావు, ప్రసిద్ధ మిమిక్రీ ఆర్టిస్టు, న్యాయవాది శ్రీ నేరెళ్ళ లక్ష్మణరావు యిదివరలోనే కొన్ని బ్రోచర్లు ప్రచురించారు. అంతకంటే నేను ఏమీ వ్రాయవలసివున్నదో, ఆ విషయాలను జనముందు వుంచడానికే. నేనీ స్వల్ప ప్రయత్నం చేశాను. సహకరించిన శ్రీ కనకారావుకు కృతజ్ఞతాభినందనలు.

శ్రీ కనకారావు లాంటి మిత్రులు చిరకాలం ఆరోగ్యంగా, సుఖంగా వుండాలి. ఈ 72 వయస్సులో గూడ శ్రీ కనకారావు లలిత కళలంటే చెవికోసుకుంటారు. సేవా దృక్పథాన్ని విస్మరించలేదు. అంతకంటే ఏమికావాలి యితడ్ని గురించి వ్రాయడానికి డబ్బు తీసుకుని ఒపినంత పొగడవచ్చు. కాని తెలిసిన వాళ్ళ ముందు పేలవం అవుతుంది. అచ్చమైన బంగారాన్ని రాపిడి చేసి వన్నె అంచనా కట్టవచ్చు. నేను ఆపనే చేశాను. ఎంత వరకు కృతకృత్యుడయ్యానో శ్రీ కనకారావు పరిచయస్థుల నిర్ణయానికి వదిలేస్తూ

- *బూదరాజు శ్యామసుందర్*

With best compliments from

## శ్రీ దుర్గా మల్లేశ్వర స్వామివార్ల దేవస్థానము

ఇంద్రకీలాద్రి, విజయవాడ

### శ్రీ కనకదుర్గా అమ్మవారి దసరా నవరాత్రి మహోత్సవములు 1994

విజయవాడ ఇంద్రకీలాద్రిపై వేంచేసియున్న శ్రీ కనకదుర్గా అమ్మవారి దసరా మహోత్సవములు ది. 6-10-94 నుండి 14-10-94 వరకు ఈ క్రింది తెలిపిన రీతిలో శ్రీ కనకదుర్గా అమ్మవారి విశేష దివ్య అలంకారములతో అత్యంత వైభవోపేతంగా జరుగును.

| తేదీ | వారము | తిథి | అలంకారము | ఉభయ రుసుము రూ. |
|---|---|---|---|---|
| 6-10-94 | గురువారము | పాడ్యమి/విదియ | శ్రీ స్వర్ణ కవచాలంకృత బాలా త్రిపురసుందరీదేవి | 1500/- |
| 7-10-94 | శుక్రవారము | తదియ | శ్రీ మహాలక్ష్మి దేవి | 2000/- |
| 8-10-94 | శనివారము | చవితి | శ్రీ అన్నపూర్ణాదేవి | 2000/- |
| 9-10-94 | ఆదివారము | పంచమి | శ్రీ గాయత్రీదేవి | 2000/- |
| 10-10-94 | సోమవారము | షష్ఠి | శ్రీ లలితాత్రిపురసుందరీదేవి | 1500/- |
| 11-10-94 | మంగళవారము | సప్తమి (మూలానక్షత్రం) | శ్రీ సరస్వతీదేవి | 2000/- |
| 12-10-94 | బుధవారము | అష్టమి (దుర్గాష్టమి) | శ్రీ దుర్గాదేవి | 2000/- |
| 13-10-94 | గురువారము | మహర్ణవమి | శ్రీ మహిషాసురమర్ధనిదేవి | 1500/- |
| 14-10-94 | శుక్రవారము | విజయదశమి | శ్రీ రాజరాజేశ్వరీదేవి | 2000/- |

పై దసరా మహోత్సవములలో దివ్య అలంకారములలో శ్రీ కనకదుర్గా అమ్మవార్కి విశేష అర్చనలు జరుపుటకు మీకు అభీష్టము ఉన్న యెడల ది.25-9-94 లోపల ఏ రోజున విశేష ఉభయము కొరెదరో తెలుపుతూ ఆ తేదీన నిర్ణయింపబడిన ఉభయ రుసుము స్వయముగా గానీ, కార్యనిర్వహణాధికారి, శ్రీ దుర్గా మల్లేశ్వర స్వామివార్ల దేవస్దానవము, విజయవాడ-1 పేరున డిమాండు డ్రాప్టు ద్వారా కాని చెల్లించి రశీదు పొందవలెను

ఉభయదాతల పూజలు దేవాలయ ప్రాంగణములో గల శ్రీ దుర్గా కళ్యాణ మండపములో జరుగును అక్కడ దంపతులను మాత్రం అనుమతించబడును. మిగిలినవారు వెనుకప్రక్క ప్రత్యేక ప్రదేశములో కూర్చుండవలెను విశేషపూజ జరుపు ఉభయదాతలకు దంపతులతో సహా (5) మందికి అంతరాలయ ప్రవేశం, హారతి మాత్రం లభించును ది 6-10-94 న శ్రీ అమ్మవారికి స్నపనాభిషేకము జరుగును. కావున ది 6-10-94న ఉదయం 10 గంటలకు శ్రీ అమ్మవారి దర్శనము లభించును ఉభయ దాతలు ఉదయం 8 గంటలకు హాజరు కావలయును

విజయవాడ — జి.వి. నరసింహమూర్తి, బి యస్‌సి , బియల్

ది. 3-9-94 — సంయుక్త కమీషనరు మరియు కార్యనిర్వహణాధికారి

Grams : "CIRCARS"
TELEX · 0475-321-ABCD-IN
Fax . (+92) 866-423562

Office . 424642 P.B.X 4 Lines
Resi. : 64545, 77655

## CIRCARS LAKSHMI MILL STORES COMPANY

FOREMOST HOUSE FOR ALL RICE MILL MACHINERY & SPARES

*Authorised Dealers for :*

## DUNLOP INDUSTRIAL PRODUCTS

Convent Street, Vijayawada-520 001.

**PLATINUM JUBILEE**

1918 - 1993

**CIRCARS**

75 Years of Dedicated service

***A MEMBER OF 'CIRCARS' GROUP. ESTABLISHED IN 1918***



Hon'ble Shri P.V. Narasimha Rao Prime Minister of India
with Sunkara Kanaka Rao

I am very happy that all of you were celebrating Sri. SUNKARA KANAKARAO's 72 Birthday with all the deserving jubiliation. He has being a very fruitful and colourful life including the Freedom movement.

I wish him long life and many more useful activities utilising his intelligent and energy.

Padma Bhushan

Balabandhu, Kalasaraswati

**Prof. Dr. P. Tirumala Rao**

M.B.B.S., M.S. (U.S.A.), F.A.A.P. (U.S.A.), F.I.A.P.

******

Thank you for your invitation on the occasion of 72nd Birthday Function of Kalapraveena, Kaloddharaka, Kalatapasvi Sri Sunkara Kanaka Rao on 13th October, 1994 at Vijayawada.

I convey my best wishes for every success of the above function.

With regards,

**Mullapudi Harischandra Prasad**

7-10-94

******



It gives me pleasure to send my heartful birthday message to a Freedom Figheter, Social Worker and great flair for art and Telugu Drama Sri Sunkara Kanaka Rao on his 72 Birth Day Celebration on 13-10-94.

His services as politician, artist,and Social worker are well recognised by one and all. His services for the development of poor Weaker Sections are note worthy.

I wish him good health prosperity to serve the fields for which he enriched years to come.

With best wishes.

**M.K. BAIG**
Minister for Technical Education

---

# మహా మనీషి

మనిసి పుట్టును - గిట్టును గతించును కాలగర్భమున
ఎందరో మరెందరో.లెక్కకు మిగులును ఏ కొందరో ఘనత వహించిన వారరుదుగ
వారిని వరించును కీర్తిప్రతిష్ఠలు శాశ్వతమ్ముగ లోకమ్మున
అందొకడుగు మా **సుంకర కనకారావు**
స్వార్థ రహితుడు - స్వాతంత్ర్యయోధుడు - ప్రజాసేవకుడు - కళారాధకుడు - నటుడు - గాయకుడు - కళాపోషకుడు
అతని ప్రతిభకు తార్కాణం - అరుణోదయ - హిందూస్థాని సంస్థల నిర్వహణం
సహాయసన్నివేశాలు అతని దైనందిన క్రియలు
నాటక - సినిమా - రాజకీయ - ఉద్యోగ కార్మిక - కర్షక రంగాలలో నన్నింట కనిపిస్తారు అతని సహాయమును
పొందిన నేటి పెద్దలు కొందరు అతడు **కనకారావు** - కాని కాంచనపరుడు కాదు మనసు వున్న - మమతలున్న
మహామనీషి మా **సుంకర కనకారావు**
అందుకో సోదరా! మీ 72వ జన్మదినోత్సవ సందర్భమున నా చిరుకానుక

ఇట్లు
ఆత్మీయుడు
కళాతపస్వి D. వేణుగోపాల్

మద్రాసు
7-10-94

---

With best compliments from
**Shri M.S. Bhagawan**, M.A., M.Ed., H.D.C. Branch Manager, Fedcon, Visakhapatnam



శ్రీ సుంకర కనకారావు 72వ జన్మదినోత్సవాన్ని జరుపబోతున్న వార్త నాకు ఎంతో సంతోషాన్ని కలుగజేస్తుంది. ఆయన అమృతహృదయుడు. కమ్మని ఆయన ఆతిథ్యాన్ని స్వీకరించని కాంగ్రెసువాదికాని, కళాకారుడుకాని, సాంఘిక సేవకుడుకాని ఆంధ్రదేశంలో లేడనడంలో అతిశయోక్తి ఏమాత్రంలేదు. 'శతమానం భవతి' అన్న శ్లోకాన్ని చిత్తశుద్ధితో పఠిస్తూ ఆయనమీద పుష్పాక్షతలు చల్లుతున్నా మీరు చేపట్టిన కార్యక్రమం దిగ్విజయంగా సాగాలని అస్మదీయుని ఆకాంక్ష.

ఇంటూరి

ఎప్పుడూ గలగలనవ్వుతూ చెలిమికి చేయిసాచే కళాంతరంగులు నా చిరకాలమిత్రులు కనకారావుగారు. ఇటు సాంస్కృతికరంగంలోనూ, అటు ప్రభుత్వపరమైన పరిధిలోనూ కనకారావుగారు ఎన్నో పదవులను అధిష్ఠించారు. విజయవాడకు దక్షిణమధ్యరైల్వేమండలిని ఏర్పాటుచేయడంలో, ఆకాశవాణి, దూరదర్శనకేంద్రాలు విజయవాడలో నెలకొల్పడంలో కనకారావుగారు వహించినపాత్ర ఆయన జీవిత చరిత్రకెక్కింది. అరుణోదయ సంగీత నాట్యమండలిద్వారా ఏళ్ళతరబడిగా ఆయన ఎందరెందరో ప్రముఖులను సత్కరించి ఎన్నెన్నో సంగీత నాట్యకార్యక్రమాలను నిర్వహించి కళారంగానికి అశ్రాంతకృషి చేశారు. అయ్యదేవర కాళేశ్వరరావుగారిలాంటి ఆంధ్ర నాయకమణి హృదయంలో చోటు చేసుకున్న సుంకర కనకారావుగారు రాజనీతిలో నీతిని నమ్ముకున్న కార్యకర్త.

డెబ్బై రెండవ జన్మదినోత్సవం చేసుకుంటున్న మిత్రులు సుంకరకనకారావుగారికి నాహార్దిక అభినందన

\- జ్ఞానపీఠ్ అవార్డ్, పద్మభూషణ్ డా|| సి.నారాయణరెడ్డి

ఎమ్.ఏ.పిహెచ్‌డి. డి.లిట

I am glad to know that 72nd Birth Day of Shri Sunkara Kanaka Rao Garu is being celebrated on 13th October, 1994

Shri Sunkara Kanaka Rao Garu is known to me well for last several decades He sacrificed his life for cultural, social and other activities. His commitment, zeal, devotion and determination compel the admiration of one and all The younger generation has to learn a lot from him.

I convey my good wishes to Shri Sunkara Kanaka Rao Garu for every thing that is good to him and the members of his family in the years to come

With best regards

\- *A. Nageswara Rao*

Movie Artist

I have received your letter dated 19-9-94. I am happy to know that your birthday Celebrations (72) are to be held on 13-10-1994, at Vijayawada.

I know that you are a Freedom Fighter, Social Worker & Cultural Promoter.

I wish the function a grand success.

With best wishes,

*- Dr.(Mrs.) J. Geetha Reddy*
Minister for Tourism and Culture.

---

I am happy to learn from your letter that our esteemed friend Sri Sunkara Kanaka Rao's 72nd birthday will be celebrated on 13th of October,1994.

I have known Sri Kanaka Rao for many decades. Whatever cause he undertakes, he performs it with great dedication and ability.

I wish him long life of happiness and prosperity.

Wishing the celebration all success.

*- Justice Avula Sambasiva Rao*
Kavuri Hill, Jubilee Hills P.O.
Hyderabad - 500 033

---

I am glad to learn that the 72nd birthday of Kalapraveena Sunkara Kanaka Rao Garu will be celebrated at Hyderabad on October 13,1994 I have known Shri Kanaka Rao Garu for a long time. As a freedom fighter, social worker and promoter of cultural activities, Shri Kanaka Rao Garu has earned ecocnium from all sections of the population. He belongs to one of those old generation of Gandhians and is highly revered. For about six decades he has rendered yeomen's service to the State and the country. I convey my best wishes to him for a long life and sound health.

I wish your function all success.

With regards

*P. Upendra, M.P.*
Parliamentary Standing Committee on Human Resource Development
Former Union Minister forInformation and Broadcating& Parliamentary Affairs.

---

Sri Kanaka Rao garu has been a good friend of mine for the last 40 years, and I am one of his admirers of his great capabilities as a true politician and a Freedom Fighter.

As an active member in the cultural activities, Sri Kanaka Rao has done great service, while associating with people like our former Chief Minister Sri N.T.Rama Rao, K. Jaggaiah and other popular Cine Actors. Sri Kanaka Rao has been always taking keen interest in the welfare of the Congress, and for what he has done to the Organization, he ought have been elevated to a much higher place by giving him an opportunity to serve the people.

I always pray for his success in all his activities, and for his continued good health.

May Heaven's Choicest blessings be showered on Sri Kanaka Rao for many more Happy Returns of his Birth Day.

Wishing the function a Grand Success,

*G.S.Raju*, M.S.(Calif),F.A.F.Ph.E.(U.S.A.)
Former Deputy Chairman A.P. Legislative Council

I am happy to learn that the Kala Praveena Sunkara Rao's 72nd Birth Celebrations Committee, Vijayawada is bringing out a souvenir on the occasion of 72nd Birth Day Celebrations of Shri Sunkara Rao.

Kala Praveena Sunkara is a hard working, simple and humble person who selflessly sacrificed his life for the social and cultural upliftment of the masses. Shri Rao was a highly respected freedom fighter and a staunch follower of Mahatma Gandhi. I am sure his ideas, thoughts and deeds will be a perenial source of inspiration to all.

I commend the members of the committee for their endeavour to commemorate his birth and hope the celebration and the publication all success.

**B. Satyanarayan Reddy**
GOVERNOR, ORISSA

Thank you very much for the invitation extended to me on the eve of 72nd Birthday Celebrations of Kalaprapurna Sri Sunkara Kanka Rao. Sri Sunkara Kanaka Rao is a well known figure in the realm of Arts, and he has done great service particularly to the Telugu stage for more than 50 years. His "Arunodaya Natya Mandali" is remembered as one of the oldest organisations which helped greatest Artists like N.T.Rama Rao, Jaggaiah, Smt. Savithri, etc. to come to that stage. It is in the fitness of things that you are celebrating his 72nd Birthday, and thus rendering great service to Arts Culture.

**JUSTICE IYYAPU PANDURANGA RAO**
CHAIRMAN
SPECIAL COURT
A.P. LAND GRABBING (P) ACT.

I am very glad that the 72nd birthday of Sri Sunkara Kanaka Rao is being celebrated at Hotel Anupama Conference hall, Vijayawada on 13th October, 1994.

I had the opportunity of knowing Sri Sunkara Kanaka Rao for the last over two years. Multi facetted Sri Sunkara Kanaka Rao who had earned a name for himself in Vijayawada for his cultural, social and political activities, had been associated with the Railways for the last 25 years. He had been a Member of the Vijayawada Divisional Railway Users' Consultative Committeee, South Central Railway Zonal Railway Users' Consultative Committee and National Railway Users' Consultative Committee and has rendered valuable advice to the Railway administration for the improvement of facilities and services to the travelling public and users.

He is always wreathed in smiles and his simple, unassuming and humble personality makes him acceptable to all.

On the eve of his 72nd birthday, I wish him a long, healthy and active life and full of service to the people, society and culture.

**N.K. CHIDAMBARAM**
DIVISIONAL RAILWAY MANAGER
VIJAYAWADA.



"అరుణోదయ సంగీత నాట్యమండలి" వ్యవస్థాపకులు

శ్రీ సుంకర కనకారావుగారికి 72వ జన్మదినోత్సవ జేజేలు!




ప్రొప్రయిటర్స్ : **యస్వీ. శేషగిరిరావు & సన్స్**

**33-5-9, సీతారామపురం, మైసూర్‌కేఫ్ ఎదురురోడ్డు, విజయవాడ-520 002**

మా అనుబంధ సంస్థలు :

**అరుణోదయ ఆఫ్‌సెట్**

రవితేజ పబ్లికేషన్స్ * ఉషోదయ ప్రింటర్స్

ఫోన్ : 431422

---

*Best Wishes From*

**Sri K.V.Raghunadha Reddy** garu
Hon'ble Governor of West Bengal, CALCUTTA

**Sri B. Gopalareddy** garu,
Managing Director, FEDCON, Hyderabad.

**Sri S.B.P.B.K. Satyanarayana Rao** garu
Dowleswaram.

**Sri N. Venkateswarlu** garu,
Business Manager, Andhra Jyothi, Vijayawada.

**Sri Dulipala Sitarama Sastry** garu,
Stage & Cine Artist, Guntur.

**Sri Kothapalli Radhakrishna** garu,
President, The Vijayawada Fruit Merchants' Association,
Mango Market, Vijayawada.

**Sri Pyala Nityananda Rao babu** garu,
Circle Inspector, Rly Protection Force, Dornakal.



# ఉద్యమకారుడు ఉత్తమ యోధుడు "కళాప్రవీణ శ్రీ సుంకర కనకారావు జీవిత చరిత్ర

విజయవాడ పట్టణ చరిత్ర ఎవరు వ్రాసినా "కళా ప్రవీణ" శ్రీ సుంకర కనకారావు పేరు ఉటంకించి పది వాక్యాలు వ్రాయకతప్పదు. ఆయనంటే గిట్టని వాడు, బద్ధవిరోధి (అసలు అజాతశతృవు శ్రీ కనకారావు) వ్రాసినా కనీసం రెండు మూడు వాక్యాలు అయినా వ్రాయకపోతే - దాన్ని విజయవాడ చరిత్రగా ఎవ్వరూ గుర్తించరు. ఇది అక్షరసత్యం.

అనేకానేక రాజకీయ ఉద్యమాలు, సంగీత నాటక కళావేదికలు, వ్యాపారస్తుల సంస్థలు, వాణిజ్య వేత్తల సంఘాలు, కార్మిక సంఘాలు, లలితకళా బృందాలు ఒకటేమిటి అన్నింట్లో శ్రీ కనకారావుకు ప్రధాన పాత్ర వున్నది. అందుకనే విజయవాడలో జీవితం అంటేనే శ్రీ సుంకర కనకారావుతో వీడదీయరాని అనుబంధం. ఆయన జీవిత చరిత్ర రచన అంటే 70 ఏళ్ళ విజయవాడ సాంఘిక, రాజకీయ, లలిత కళా రంగాల చరిత్రకు అద్దంపట్టాడన్నమాట.

## జననం - కళా రంగంలో కూడ

విజయవాడ నగరం వించిపేటలో ఒక సామాన్య కుటుంబంలో శ్రీ సుంకర స్వామి, మహాలక్ష్మమ్మల అయిదుగురు పుత్రుల్లో నాల్గవవారిగా శ్రీ కనకారావుజన్మించినారు 1923 అక్టోబరు 13 శనివారం సాయంత్రం 6 గంటలకు. వీరికి ఒక సోదరి కూడ వున్నారు. బాల్యం చాలా సామాన్యంగానే గడిచింది. ఆగర్భ శ్రీమంతులు కాదు కాబట్టి తోటిపిల్లల్లాగానే పెరిగారు.

12వ ఏట తండ్రి గారి మరణం ఒక అశనిపాతం ఆపసివాని జీవిత రంగంలో. అయితేనేం తల్లి, సోదరుల వాత్సల్యంలో ఓలలాడుతూ జీవన గమనం ప్రారంభించారు శ్రీ కనకారావు.

చక్కని రూపసి శ్రీ కనకారావు. రంగస్థలం మీద ఆయన కన్నుపడ్డది బాల్యంలోనే. 13 సంవత్సరాల కుర్రవాడుగా గుంటూరు మాష్టర్‌రాజుగారి ఆధ్వర్యాన విజయవాడ మైలవరం హాల్లో "హరిశ్చంద్ర" నాటకంలో చంద్రమతి పాత్ర వేసి సదస్యులను మురిపించి ఏడ్పించారు. రూపం, గాత్రం, అభినయం, ముప్పేటగా రాణించడంతో నాటకం చూచి ముగ్ధురాలయిన అందాల సుందరి, ప్రఖ్యాతనటి శ్రీమతి పువ్వుల రామతిలకం, శ్రీకనకారావుకు భగవద్గీత పారాయణ గ్రంథం, ఒక వెండికప్పు బహూకరించి ఆశీర్వదించారు. శ్రీ సుంకర బాల్యంలో యిదొక మరువలేని మహద్ఘటన.

14 సంవత్సరంలో అడుగుపెట్టగానే విజయనగరం శ్రీద్వారంవారి సంగీత కళాశాలలో శ్రీ రాఘవదాసుగారి వద్ద గాత్ర సంగీతంలో శిక్షణ పొందారు. శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడుగారు ఈ కళాశాల ప్రధానాచార్యులు. సుప్రసిద్ధ వైణికులు శ్రీ వాసా సాంబమూర్తి గారు వీణ మాష్టారు. ఆబంగారు రోజులను తలచుకొని శ్రీ కనకారావు మురిసిపోతుంటారు ఈరోజుకీ. "హరికథాపితామహులు' ""శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణ దాసు గారు హరికథలు, గిరి కథలు గానం చేస్తున్న కాలం. వారింట్లో తాము తిరగడం, అలాంటి పెద్దలసేవ శుశ్రూషల భాగ్యం తమకు లభించడం పూర్వజన్మసుకృతంగా ఆయన వినయంతో చెప్పుకుంటారు.

15 వ సంవత్సరం వచ్చేటప్పటికి శ్రీ కనకారావులో నటుడు విజృంభించాడు. పూవుపుట్టగానే పరిమళిస్తుందని సామెత ఆయన పట్ల సార్థకం. నటుడు శ్రీ పువ్వుల సూరిబాబు గుడివాడ కేంద్రంగా నాటక ప్రదర్శనలు యిస్తుండేవారు. ఆయన "కృష్ణలీలలు" నాటకం చాలా గొప్పగా ఆడేవారు. ఆయన సోదరి సభారంజని మొదటి కృష్ణుడు. ఈనాటి ప్రఖ్యాత చలనచిత్ర సంగీత దర్శకులు శ్రీ సాలూరి రాజేశ్వర రావు మూడవ కృష్ణుడుగా నటించేవారు. శ్రీ కనకారావును చూచి ముచ్చటపడిన శ్రీ సూరిబాబు ఆయన చేత 2వ కృష్ణుడు వేషం కట్టించారు. ఇది 1939 - 40 లలో జరిగింది. నాటకం మరింత రక్తి కట్టడంతో కృష్ణా, ఉభయగోదావరి జిల్లాల్లో "కృష్ణలీలలు' అంతులేనన్ని ప్రదర్శనలకు నోచుకున్నది. ఈ రోజుల్లో వలె ఆరోజుల్లో మైకులులేవు. సాంకేతిక సౌకర్యాలు లేవు. అయినా శ్రీ సూరిబాబుకు బహుళంగా కీర్తి ప్రతిష్ఠలు సంపాదించి పెట్టింది. ఆతరువాత ఆరోజుల్లోనే గుంటూరులో శ్రీదంటు కృష్ణయ్య గారు స్థాపించిన "బాలమిత్ర సమాజంలో కృష్ణుడు, మన్మధుడు, ఇంద్ర సేనుడు, మార్కండేయుడు, పాత్రలు ధరించేవారు శ్రీ కనకారావు. ఈ అందమైన బాలనటుడికి ప్రేక్షకులు హారతులు పట్టేవారట. ఆనాటి అగ్ర శ్రేణినటులు శ్రీ కపిలవాయి రామ నాథశాస్త్రి "రామదాసు" గా, శ్రీ జొన్నవిత్తుల శేషగిరిరావు కబీరు గా నటిస్తున్న 'భక్తరామదాసు" నాటకంలో శ్రీ కనకారావు రఘురామునిగా నటించి జీవించేవారు. మంచి గాయకుడు, నటుడు, అందగాడు కావడంవల్ల శ్రీ కనకారావుకు పెద్ద 'డిమాండు' వుండేది. అనేక యితర నాటక సమాజాలవారితో లోహితాస్యుడు, మార్కండేయుడు, నారదుడు,

కృష్ణుడు మొదలయిన అనేక పాత్రలు ధరిస్తూ కమ్మగా పాడుతూ, చక్కని నటనా వైదుష్యంతో శ్రీ సుంకర కనకారావు (ఎస్. ఎస్. ఎల్. సి లోకి అడుగుపెట్టారు) యిలా కళాకారుడిగా ఎదుగుతూ తనకీర్తి పతాకకు ఎదురు లేదు అనిపించుకున్నారు.

## రాజకీయ ప్రవేశం

అది 1942. "క్విట్ ఇండియా" ఉద్యమానికి జాతిపిత పూజ్యబాపూజీ పిలుపు యిచ్చిన సంవత్సరం. అశేషజన వాహిని, పిల్లా పెద్దా బేధం లేకుండా రాజకీయ రణ రంగంలో ఉరికిన సంవత్సరం. పూజ్యబాపూజీ పిలుపు తమకే అన్నంతగా ప్రబోధితులయ్యారు శ్రీ కనకారావు. ఆ ప్రబోధంతో కృష్ణా, గుంటూరు జిల్లాల్లో వీరు వీరవిహారం చేశారు. ఎంత దీక్షతో, నిర్భయంగా కార్యరంగంలో దూకినారో తమకు ఈనాటికీ ఆశ్చర్యం వేస్తుంటుందని అంటుంటారు శ్రీ కనకారావు అస్మృతులను గుర్తుచేసుకుంటూ. బెజవాడలో శ్రీ మరుపిళ్ళ చిట్టి, శ్రీరాయనరాములు గారి అండదండలు వీరి కుండేవి. వారి అడుగు జాడల్లో "క్విట్ఇండియా" ఉద్యమ కార్యక్రమాల్లో 1942 ఆగష్టు 9న పాల్గొన్నారు. అప్పట్లో శ్రీయుతులు అయ్యదేవర కాళేశ్వరరావు, పోతిన గణపతిరావు పాత్రుడు, సర్దార్ మరుపిళ్ల చిట్టి విజయవాడ రాజకీయరంగంలో త్రిమూర్తులు. బ్రిటీష్ సింహం జూలు పెకళించి నానా భీభత్సం సృష్టించారు పోలీసులకు చిక్కకుండా తమ కార్యక్రమాలు కొనసాగించడంకోసం "రహస్య జీవితం" (అండర్ గ్రౌండు జీవితం) ప్రారంభించారు శ్రీ కనకారావు. సర్వశ్రీ రాయన రాములు, శిరిపురపు కోటేశ్వరరావు, పోతిన వెంకన్న, కంచుపిళ్ళ పద్మనాభం, పింగళి పానకాలరావు, డాక్టర్ ఎ. వి. ఎల్. నరసింహరావులతోపాటు ఉద్యమాలు నడుపుతూ ఆరుమాసాలు గడపిన రహస్యజీవిత కాలంలో శ్రీ కనకారావు ఆరోగ్యం పూర్తిగా దెబ్బతిన్నది. టాన్సిల్స్ ముదిరి ఆపరేషన్ (శస్త్ర చికిత్స) చేయించుకోకతప్పని స్థితిలో, ఆ రహస్య జీవితంనుంచి బయటకు రాక తప్పలేదు శ్రీ సుంకరకు.

## అనుకోని దెబ్బ - అదే అసలు మలుపు

టాన్సిల్స్ బాధా నివారణ కోసం ఆపరేషన్ చేయించుకుంటే, ఆ డాక్టర్ మహానుభావుడు (పేరు యిప్పటికీ బహిరంగ పరచడానికి శ్రీ కనకారావు యిష్టపడరు. "మంచో, చెడో అంతా మనమేలుకే జరిగింది అనుకోవాలి' అంటారు.) పెరిగిన టాన్సిల్స్‌తో పాటు కొండ నాలికను గూడ కత్తిరించడంతో (పొరపాటో గ్రహపాటో మరి), శ్రీ కనకారావు గాత్ర మాధుర్యం, గంధర్వ గాత్రం మూగ పోయింది. దానితో ఆయన రంగస్థల జీవితానికి తెరపడ్డది. 1943లో జరిగిన ఈ దుర్ఘటనను ఎంత ఓర్పుతో, ఎంత ఆత్మసంయమనంతో భరించారో మరొకరయితే కుమిలి కృశించి పోయేవారు.

తానువేషం వేసి లాభంలేదు. కానీ కళారంగాన్ని తమకెంతో ప్రయాతిప్రియమైన నాటకరంగాన్ని వదల గూడదు. కళామతల్లి సేవలో తన పాత్ర నిష్క్రమించవలసిందేనా? ఇంత అర్థాంతరంగా, మొగ్గగా, ముగిసిపోవలసిందేనా అని మధనపడ్డారు శ్రీ కనకారావు. నటనకు అవకాశం లేక పోవచ్చునుగాక, కళాకారుడుగా తన స్థానం తానెనుకోల్పోరాదనే పట్టుదలతో, మనోధైర్యంతో, ధృడ సంకల్పంతో. అనాటి ప్రఖ్యాత సంగీత విద్వాంసులు "పరదేశి" "షేక్ అలీ" గార్ల వద్ద తబలా వాద్యం నేర్చుకున్నారు. అందులో పరిణిత స్థాయికి చేరుకుని, అనేకపట్టణాల్లో "సోలో" కచ్చేరీలు చేసినారు. అఖండ ప్రజ్ఞాపాటవాలు ప్రదర్శించి, రెండు సంవత్సరాలపాటు కచ్చేరీలు చేయడం, బహుమతులు గెల్చుకు రావడం ప్రశంసలు పొందడం ప్రధాన లక్ష్యంగా శ్రీ కనకారావు పరిశ్రమించారు

## ఉద్యమకారుడుగా జననం

## విజయపరంపరకు సోపానం

1945 వచ్చింది. గట్టిగా లెక్కచూస్తే శ్రీ కనకారావు వయస్సు 22 ఏళ్ళు గూడా పూర్తిగా నిండలేదు. పాలుగారే బుగ్గలు యింకా ముదరలేదు. రంగస్థల నటుడుగా తానుగా సాధించలేని విజయాలను యితరుల ద్వారా సాధించి తీరాలని పట్టుదల శ్రీ సుంకర హృదయాన్ని తొలుస్తున్నది. ఉత్తమనటులను, గాయకులనుకళాకారులను ఎందుకు తయారుచేయరాదు అనే తపన ఆయన ఆలోచనను తట్టి మేల్కొలిపింది. ఆయన కళా జీవన వ్యవసాయం కొనసాగించడానికి కృతనిశ్చయులయినారు. ఆయన ఆలోచనలకు రూపవేూ "అరుణోదయ" శ్రీ కనకారావుతో డి. వేణుగోపాల్ (నృత్య దర్శకుడు) ఆవిర్భావం ఈ వ్యవస్థాపన ఈ మహాసంస్థ ఏనాడు పుట్టిందోగాని, ఆనాటి నించీ సంస్థ కళాకారులకు పట్టుకొమ్మకావటమే కాదు, చల్లని నీడ అయింది. విక్రమార్కుని సింహాసనంలా ఈ సంస్థలో అడుగుబెట్టిన ప్రతికళాకారుడూ రాణించాడు. రసహృదయుల్ని సంతోష వారిధిలో ఓలలాడించారు. కళారంగంలో ఒక్కొక్క మెట్టూ ఎక్కుతూ, సాలభంజికల వంటి విమర్శకుల ప్రశ్నలకు తమ్ముడుకోకుండా సమాధానిస్తూ "పదండి ముందుకు, పదండి తోసుకు, పదండి పోదా పైపైకి" అంటూ కదం త్రొక్కుతూ వెనుచూపు లేకుండా ప్రగతి పథంలో కీర్తిపతాకాలు రెపరెపలాడించారు శ్రీ కనకారావు.

బ్రిటీషు పాలనలో మనదేశ సంస్కృతి, కళలకు భవిష్యత్తుకాన రావడం లేదు. ఉడుతాభక్తిగా కళామతల్లి రుణం తీర్చుకొనేందుకై చేతనైన కృషి ఎందుకు చేయకూడదు అని శ్రీ కనకారావు ధృఢ సంకల్పులై, "అరుణోదయ సంగీత నాట్యమండలి" ద్వారా అనేకనాటిక, నాటక ప్రదర్శనలు నిర్వహించేవారు. "దేవరాజు, బలిదానం, నాదేశం, పన్నా, ఉమర్‌ఖయ్యాం, గౌతమబుద్ధ, ఖిల్జీరాజ్యపతనం, తీరని కోరికలు, కన్యకాపరమేశ్వరి, యోగివేమన, మాబావ, దారినపోయే దానయ్య, జ్వలితజ్వాల, చేసిన పాపం, ప్రతీక్షవంటి ఆదర్శ ప్రబోధనాలయిన పలు ప్రదర్శనలు ఈ నాట్యమండలి వేదిక ద్వారా ఉత్తఓత్తమ ప్రదర్శనలుగా కీర్తిని ఆర్జించాయి.

ఈ మండలి వేదిక మీదనే. ప్రసిద్ధ నాట్యాచార్యులు శ్రీ వేణుగోపాల్, కె. వి. రామరాజు, బి. ధర్మరాజు, K. జగ్గయ్య, K.V.S.శర్మ, జి. రత్నారావు, C రామమోహనరావు, వెంపటి రాధాకృష్ణ, రూపశిల్పి పి, రామచంద్రరావు, కుమారి సావిత్రి, పోలి పెద్ది శర్మ, మెట్టా రామశాస్త్రి, నిర్మల, జయక్ష, సుశీల, పార్వతి, అక్కీ, వహీదారహమానుల సహాయ సహకారాలతో నాట్య, నాటిక, నాటక, ప్రదర్శనలు నిర్వహించారు.

ఈ సందర్భంగా పాఠకులు గుర్తుంచుకోదగిన ముఖ్య విషయం ఒకటున్నది. తన ప్రాభవం కోసం, ప్రచారం కోసం, ధనార్జన కోసం మాత్రం శ్రీ కనకారావు ఈ ప్రదర్శనలు నిర్వహించలేదన్న నిజం. మహత్తరమయిన మానవతాలక్ష్యాలను సాధించాలంటే, సమాజం సంస్కరింపబడి ఉత్తమమైన రూపు దిద్దాలంటే కళ మాత్రమే ఏకైక సాధనమని గుర్తించిన శ్రీ కనకారావు తన ధన,మాన, ప్రాణాలను కళారంగ సేవకై నిస్వార్థంగా అంకితం చేశారు. తమ సంపాదన కుటుంబావసరాలకు ఏకొద్దో మినహాయిస్తే, యావత్తూ కళాసేవలో ధారపోశారు. తండ్రిలేక పోయినా సోదరుల సంపాదన మొత్తంగా ఎలా వెచ్చిస్తున్నా, అనేక బృహత్కార్యాలు సాధించడానికి తమ సోదరుల వాత్సల్యం వెన్నుదమ్ముగా నిలవకపోతే, తమ అడుగు ముందుకు పడడం కష్టమయ్యేది అంటారు శ్రీ కనకారావు. తను చేసే ఏపనితప్పుపట్టకుండా, తను నిరుత్సాహపరచకుండా, తనసోదరులిచ్చిన సహకారం మరువరానిదని, వారికి తాను జీవితాంతం కృతజ్ఞుడుగానే వుంటానని, చేతులెత్తి నమస్కరించి చెపుతుంటారు శ్రీ కనకారావు.

ఆ కాలంలో విజయవాడ పట్టణ జనాభా 50 వేలకు మించి లేదు. గాంధీనగరం, అరండల్ పేట, వించిపేట, పాత బస్తీ, ఒకదాని నుండి మరొకటి విసిరివేసినట్లుండేవి. ఇండ్ల స్థలాల ధరలు స్వల్పం.. నిజానికి కళా సేవలో శ్రీ కనకారావు వెచ్చించిన ధనంతో ఆకాలంలో అయితే విజయవాడలో ఒకపేట ఆవరించే ఇళ్ళు కొనుక్కోగలిగి వుండేవారు. దైవ నిర్ణయాన్ని కాదనలేముకదా. శ్రీ కనకారావు సంపాదన యిలా కళాకారులకోసం ఖర్చు చేయాలని విధిలిఖితం. మిత్రుల పేరు, ప్రసిద్ధి, పెంపుతనదిగానే, భావించే నిస్వార్థ జీవి నిరాడంబరుడు, నిగర్వి శ్రీ కనకారావు.

ఇలా సేవాకార్యక్రమాల్లో మునిగి తేలుతున్న శ్రీ కనకారావుకు మరో చిత్రమయిన ప్రయోజనకరమైన ఆలోచన తట్టింది. స్వతహాః సంగీత ప్రియుడుకావడంతో, తబలా వాద్యకారుడుగా హిందుస్థానీ సంగీతాన్ని మనసారా ప్రేమించేవాడు కావడంతో, భారతీయ సంగీత సేవ ఎందుకు చేయరాదనే అభిలాష కలిగింది. మిత్రులు, సంగీత ప్రియులు అయిన శ్రీ ఎం.జి. యం. సోమయాజులుగారిని కలుపుకుని "హిందూస్థానీ సంగీత మండలి" స్థాపించి కర్నాటక, హిందూస్థానీ సంగీత రీతుల్లో పలుకచ్చేరీలు జరిపించారు శ్రీ కనకారావు. సుప్రసిద్ధులయిన విద్వాంసుల కచ్చేరీలువిని, వాటి సారస్యం అనుభవించే అదృష్టం విజయవాడ పౌరులకు సమకూర్చారు శ్రీ సుంకర.

"శ్రీ హిందూస్థాన్ సంగీత మండలి" అధ్యక్షులుగా శ్రీ మొతే సుబ్బారావు, సుందరలాల్ మొహతాలు వుండేవారు. హిందూస్థానీ సంగీత మండలి కళాపీఠంవేదికల మీదశ్రీమతి హీరాబాయి బరోడ్కర్, పర్వీన్‌సుల్తానా, సరస్వతీ మాణే, మోతీవేదకుమారి, ఉస్తాద్ బిస్మిల్లా ఖాన్, పండిట్ రవి శంకర్, ప్రొఫెసర్ నారాయణరావు వ్యాస్, జె. ఎల్. రనడే, పండిట్ జస్‌రాజ్, ప్రొఫెసర్ వినాయకరావు పట్వర్ధన్, బడేగులాం అలీ ఖాన్, ఉస్తాద్‌నిస్సార్ హుస్సేన్, ఉస్తాద్ అల్లారఖా, దేశపాండే, జయచంద్ర ప్రసాద్, అంబా ప్రసాద్, దావూద్‌ఖాన్, మంగళంపల్లి బాల మురళీకృష్ణ, పారుపల్లి రామకృష్ణయ్య పంతులు, చిలుకూరి భీమశంకర రావు, జొన్నవిత్తుల సుబ్బారావు, పింగళి జగన్నాధం, కొండూరి సూర్యనారాయణ, ద్వారం వెంకట స్వామినాయుడు, ద్వారం నరసింగరావు కోలంకి వెంకటరాజు, చిలకల పూడి వెంకటేశ్వరశర్మ, కంభంపాటి అక్కాజీరావు, మాష్టర్ అవధాని లాంటి జమాజెట్టీలు చేత కచ్చేరీలు నిర్వహింప చేసి సన్మానాలు చేశారు. ఈ వేదికల మీద గౌరవమొందిన ప్రముఖుల్లో వీరు కొందరు మాత్రమే.

అలనాడు "శ్రీ అరుణోదయ నాట్యమండలికి శ్రీచదలవాడ పిచ్చయ్య, ఇంటూరి కోటేశ్వరరావులు, "హిందూస్థానీ సంగీత మండలికి" శ్రీయుతులు మోతే సుబ్బారావు, సుందరలాల్ మెహతాలు అధ్యక్ష స్థానాలు అలంకరించగా, ఈ రెండు సంస్థలకూ మన కనకారావు వ్యవస్థాపక కార్యదర్శిత్వం నెరపుతూ కార్యక్రమాల రూపకల్పన, విజయాలకు ప్రత్యక్ష కారకులుగా వ్యవహరించేవారు.

ఆ సంగీత సౌరభాన్ని ఆస్వాదించిన పెద్దలు అంటుంటారు గాంధీనగరంలో షికారు నడుస్తుంటే ఆ జ్ఞాపకాలు ఉరకలు వేస్తుంటాయని, భావుకులయిన వారిని సంగీత సరస్వతి కంకణ నిక్వణం అలవోకగా ఆవరించుకొంటుందని, కళామతల్లి చిరుగజ్జెల సవ్వడి మంద్రంగా వినబడుతూనే వుంటుందని. ఎంత మధురిమ అనుభవించారో ఆ అదృష్టవంతులు.

## శ్రీ కనకారావు సంస్కారహృదయం

సుప్రసిద్ధ సంఘ సంస్కర్తలు శ్రీ రాజారామమోహనరాయ్, శ్రీకందుకూరి వీరేశలింగం పంతులు, సమాజ సంస్కరణ ఈదృక్పథంతో లక్ష్య సాధనలకై ఎన్ని కష్టనష్టాలు, ఇబ్బందుల పాలయ్యారో మనం పుస్తకాల్లో మాత్రమే చదువుతున్నాం.

కాలం మారి, నాగరికత పెరిగి, ఎన్నో సంస్కరణోద్యమాలు వచ్చి, ప్రజల్లో ఎంతో మార్పు వచ్చిందని, భావిస్తున్న రోజుల్లోనే ముస్లిం బాలికలు గజ్జెకట్టి రంగం స్థలం మీద నృత్య ప్రదర్శనలు యివ్వాలంటే, ముస్లిం సమాజం సహించలేకపోయింది. అలాటి ఒక సంఘటనలో శ్రీ కనకారావు పొందిన కష్టనష్టాలు గణనీయ మయినవంటే మనం నమ్మగలమా. నిజాలను నమ్మకతప్పదు.

ఆనాటి సమాజం ఈనాడంత పురోగమించలేదు. "నటి, నట గాయకులు పంక్తి బాహ్యాలు" అనే సిద్ధాంతం అప్పటికి బాగానే అమల్లో వుంది. పోనీ స్త్రీలిల్ని వదిలేద్దాం. వీరిలో చాలామంది పెద్ద మనుషులకోవలో వారే. వారిని పంక్తి బాహ్యాలు అంటే విందు భోజనాల ప్రాప్తి వుండదు. ఆరసికాగ్రగణ్యులు సమాజంలో గొప్ప గొప్ప స్థానాలు అలంకరించి, శ్రీమంతులై, పలుకుబడి కలిగి సంఘ, జీవితాన్ని శాసించగల సర్వ సమర్థులుగా వుండేవారు.

పోతే నటులు, గాయకులు చాలా మంది సామాన్యులు .తమకళా సంపద ద్వారా పొట్టలు పోసుకునే వారు. ఆచార్యత్వం నెరపినా శిష్యులకు మాత్రం గౌరవనీయులు. మిగతా వారికి ఆనందాన్నిచ్చే జడస్వరూపులు. గణికనృత్యం చేస్తే ఆనందిస్తారు పెద్దలు. నాటకంలో పాత్రలో జీవిస్తే మహదానంత భరితులై శబాష్ అంటారు. మేజువాణీలో చెక్కిలిమీటితే, దండలూగేస్తే, కనుసైగచేస్తే కనక వర్షం కురిపిస్తారు చీకటి తప్పు సమయంలో మడి, ఆచారి ఏ తేస్తారు. కానీ, నటులూ, గాయకులు పంక్తి బాహ్యాలు. తమతో సరిగారు. వారు చెడిపోయినసజ్జు, అస్పృశ్యుల క్రిందనే లెక్క.

ఈ ఉపోద్ఘాతానికి శ్రీకనకారావు చరిత్ర కుసంబంధం, కొంతవుండి వుంటుంది తప్పకుండా. శ్రీ కనకారావు మిత్రులలో నటులు, గాయకులు వున్నారు. వారి మంచీ చెడ్డతనది. వారు అభోజనంగా వుండడం ఆయనకు గిట్టదు. తన యింట్లో విడిది. వారికి తనయిల్లే భోజనసత్రం తన అండదండలే వారికి ఎడుగడ. గర్వంగా కచ్చేరీచేసి, గౌరవంగా సన్మానం పొంది తిరిగి వెళ్ళేవారు వారు అందుకు శ్రమంతా శ్రీ కనకారావుది.

సంఘసంస్కరణ అంత సులభం మాత్రంకాదు. చిన్నదే అయినా చాలా ముఖ్యమైన ఒక సంఘటన వివరిస్తాను.

జనాబ్ రహమాన్‌సాహేబ్ ఒక నాటి విజయవాడ నగర పాలక సంస్థ కార్య నిర్వహణాధికారి. ఆయనకు ఇద్దరుముద్దు బిడ్డలు. షహీదా, వహీదా. ఇద్దరికీ ఆయన నృత్యం నేర్పించారు. కళాహృదయం కలవారుకావడంతో, విజయవాడ వచ్చిన ప్రతి కళాకారుడికీ, శ్రీ కనకారావు దృక్పథంలోకి వస్తారు. కళలంటే శ్రీకనకారావే. ఆయన పూనుకుంటే మంచి సంస్థ తరవున ప్రదర్శన యివ్వవచ్చు. ఆయన సంస్థలు నిర్వహించే ప్రదర్శనలకువేలాది జనంరావడమే కాదు. సహృదయులయిన ప్రేక్షకులు హాజరవుతారు. ప్రసిద్ధులైన కళావేత్తలు కళాపోషకులు, చలన చిత్ర దర్శకులు, నిర్మాతలు ముందు సీట్లు ఆక్రమించి, ప్రదర్శనల్లో పాల్గొంటున్న కళాకారుల్ని పరిశీలనగా చూస్తారు. వారి సమర్థత అంచనా వేసిచూస్తారు. చలన చిత్ర పరిశ్రమకు పనికి వస్తారనుకున్న వాళ్లని సూదంటు రాళ్ళలా ఆకర్షించి తీసుకువెడతారు. కళాకారులు కూడా లాభపడతారు. దానితో మిగతా కళాకారులు గూడా. వారిదృష్టిలో పడాలని పోటాపోటీలుపడి నటిస్తారు. నర్తిస్తారు. గానం చేస్తారు. వాద్యకారులు తమ ప్రతిభనంత ప్రదర్శిస్తారు. అలాటి సదవకాశం తనుకు పిల్లలకు రావాలని జనాబ్ రహమాన్ సాహేబ్ ఆశించారు. శ్రీ కనకారావు గారిని సంప్రదించి తమకుమార్తెల నాట్య ప్రదరశనఏర్పాటు చేసి, వారికి యితోధిక ప్రోత్సాహమీయ వలసిదిగా అభ్యర్థించారు. శ్రీకనకారావు సహజంగానే యిటువంటి కార్యక్రమాలకు దోహదమిచ్చే స్వభావం కలవారు గనక మాటయిచ్చే శారు ప్రదర్శన జరిపిస్తామని ,చిన్నారులకు తగిన ప్రోత్సాహమిమిద్దామని.

అంతాసజావుగా జరిగితే "థ్రిల్" అంటూవుండదు. ముఖ్యంగా శ్రీకనకారావు పూనికలో "థ్రిల్" అనుకోకుండానే ఏర్పడింది ముస్లింపిల్ల బురఖాలేకుండా పదిమందిలోకి రావడమా? అంతలో డాన్సు దుస్తులు ధరించి ప్రజాసందోహం ముందు తైతక్కలాడడమా? విజయవాడ ముస్లింలకు కోపం వచ్చింది. జనాబ్ రహిమాన్ గారి బంధువర్గాన్ని రెచ్చగొట్టారు. నాట్యం నేర్చుకునేటప్పుడు లేని ఘోషా ప్రదర్శనలు యిచ్చేటప్పుడు ఎందుకు? మొగలాయి నవాబులు, అనేక ముస్లిం

రాజ కుటుంబాలవారు నృత్యాన్ని ప్రోత్సహించేవారని చరిత్ర చదివిన మన అందరికి తెలుసు. రాణీవాసం జనానా మహిళలు మాత్రమే బురఖా పాటించేవారు. నవాబుగారి భార్యలకు పరదాలు వుంటాయి. కాని వారి వినోదం కోసం ఆడిపాడే నృత్యాంగనలకు పరదావుండదు. అఖ్ఖర్లేదుకూడ. నవాబులు, వారిసామంతులు బురఖాల్లో లేని నర్తనీమణుల నృత్యాలు బహిరంగ సభల్లో చూచి ఆనందించేవారు. అయిన ఇవన్నీ ఆలోచించేదెవరు? ముస్లిం కన్యల నృత్య ప్రదర్శనకు ఎవరో ఒక కళాకారుడు, కళాబంధువు, కళాసేవకుడు. తబలా వాద్యకుడు, నటకుడు ఆర్గనైజు చెయ్యడమా? "నీకు సున్నంలోకి ఎముకలు మిగలవు" అన్నారు కొందరు. " ఈ ప్రదర్శన యేర్పాటయితే, నీ ప్రాణాలే నిలవవు. ఖబడ్దార్".అని బెదిరించారు. రహమాన్ సాహేబ్ బంధువులతో సహా. రహమాన్ గారు వ్యధపడసాగారు. "ఏం ఫరవాలేదు. నేమన్నానన్నారు" శ్రీ కనకారావు "నన్నేం చేయలేరు. నా దమ్మునాది" అని గూడ అన్నారు శ్రీ కనకారావు.

శ్రీ కనకారావు మాట యివ్వనే యివ్వరు. ఇచ్చింతరవాత మాట తప్పడం ఎట్టి పరిస్థితిలోనూ జరగదు. అన్నమాట చెల్లించుకోవాలనే స్వభావం శ్రీ కనకారావుది. నిజంగా తాను తప్పు చేస్తే, పదిమంది ముందర తలవంచి క్షమాభిక్ష కోర గల నిజాయితీ పరుడాయన. అంతటి సంస్కారి. ఎవరో ఏదో చేస్తారని భయ పడే స్వభావం కాదు శ్రీ కనకారావుది మంచిపని అని తాము హృదయపూర్వకంగా నమ్మిన తరువాత ఎట్టి భయానికి ఎట్టి పరిస్థితులలోనూ, వెనుకంజ వేయడం ఆయన స్వభావానికి విరుద్ధం. తన కులస్తులు కాదు. మతస్థులు కాదు. పోనీ తనతోఎంతో కాలంగా కలిసివున్న ఆత్మీయులూ కాదు. పోనీ తానా శాండోనా? ఫైల్ మానా? కరాటే వీరుడా? అదీకాదు. సున్నిత మనస్కుడు. సుందరరూపుడు. సుకుమార గాత్రుడు. అయినా ధైర్యం పట్టుదల వీడకుండా, ఆ ముస్లింకూనలకు అండగా నిలబడి జవహర్ టాకీసు (ఈనాటి విజయాటాకీస్) లో "షహీదా, వహీదా""ల నృత్య ప్రదర్శన ఏర్పాటు చేశారు.

ముస్లిం సోదరులకు వీరావేశమొచ్చింది. ఉగ్రం పూనింది. "నీ ఏర్పాట్లు భగ్నం చేస్తాం" అన్నారు. "చూద్దాం" అన్నారు సుంకర. యువజనులు చాలా మందిని సమీకరించారు. పరిస్థితి వివరించారు ధైర్యాన్ని నూరిపోశారు. షహీదా, వహీదాల నృత్య ప్రదర్శన భారీగా, రమ్యంగా, జనాహ్లాదపరంగా దిగ్విజయమయింది. నృత్యానంతరం శ్రీ యండమూరి సత్యనారాయణ వ్రాసిన "తీరని కోరికలు" నాటకం గూడ జయప్రదంగా జరిగింది. ప్రదర్శనోత్సవాన్ని భంగం చేయడానికి అవకాశం లేక, అవకాశం దొరక్క, కసిగా వించి పేటలోని శ్రీ సుంకర నివాసాన్ని ధ్వంసం చేశారు ముస్లిం దుండగులు. వారికున్న కొద్దిపాటి ఆస్తిపాస్తులు కొల్లగొట్టారు. మహావీరులమని మురిసిపోయారు. కానినైతికంగా శ్రీ కనకారావు విజయం సాధించారు. మాట చెల్లించు కోవడమేకాదు. ప్రదర్శనశాలను కట్టవలసిన సొమ్మును ప్రదర్శన మరునాడే కట్టవలసి రావడంతో, కేదారేశ్వరపేట లోని తమ నివాసస్థలాన్ని విక్రయించి ప్రదర్శన ఖర్చులక్రింద 3వేల రూపాయిలను ప్రదర్శనశాల వారికి జమకట్టారు. ఇలా కళా రంగ సేవలో శ్రీ సుంకర పొందిన గొప్ప గొప్పఅనుభవాలు చాలా వున్నాయి. కళామతల్లి సేవలో శ్రీకనకారావు కోల్పోయింది. స్వల్పం మాత్రం కాదు.

శ్రీ సుంకర పట్టు కంకర పట్టు. ఆరంభించి పరిత్యజించడం ఆయన నిఘంటువులోనే లేదు. ఏ పని ఆరంభించినా ఆసాంతం సాధించి "విజయం నీదే" అని నలుగురూ అంగీకరించేదాకా నిద్రపోరు. ఒక ప్రదర్శనతోనేఏకళాకారులకు ప్రఖ్యాతిరాదు. అందుకనే షహీదా, వహీదా రహమాన్ సోదరీమణుల నృత్య ప్రదర్శన మరొకటి జరిపిస్తే బావుంటుందని భావించి తెనాలిలో "ఆంధ్ర నాటక కళాపరిషత్ పోటీలు" జరుగుతుంటే ఆరంగ స్థలం మీద రహమాన్ సోదరీమణులకు మరోక అవకాశం కల్పించి నృత్య ప్రదర్శన యిప్పించారు.

లక్ష్య శుద్ధి, ఆత్మ విశ్వాసం, అందుకు తగ్గస్థైర్యం గల మహా శక్తి యుక్తుడు శ్రీ కనకారావు. రాజకీయ, కళారంగాల్లో సవ్యసాచిగా దూసుకుపోవడమేగాని, వెనుకంజ వేయని శ్రీ కనకారావు ఉత్తమ ఉద్యమాల నిర్మాత, మహోత్తమ యోధుడు.

## ఒక ఇంటి వాడయ్యాడు

"అరుణోదయ సంగీత నాట్యమండలి" పుట్టిన కొద్ది రోజుల్లోనే శ్రీ సుంకర కనకారావు జీవితంలో మరో మధుర ఘట్టం పొటమరించింది.

పశ్చిమ గోదావరిజిల్లా "దువ్వ" గ్రామస్తులు శ్రీ బొళ్ళబుచ్చయ్య మాష్టరు గారు తమ పుత్రిక లక్ష్మీ నరసమ్మను సాలంకృత కన్యాదానం చేశారు శ్రీ కనకారావుకు

శ్రీకనకారావు జన్మతః కాపు. 1945 జూన్ 2 వతేదీనించి సంసారి అయ్యారు. క్రొత్త సంసారం. అయినా కళారంగాన్ని విస్మరించలేదు ఆయన.

1946 వచ్చింది. ఇటు కళారంగంలో ఊపిరిసలవని కార్యక్రమాలు నిర్వహిస్తున్నా, గాంధీ మహాత్ముని ఆంధ్రదేశ పర్యటన

సందర్భంగా విజయవాడలో ఆయన దర్శనం చేశారు కనకారావు. బుడమేరులో వారి కార్యక్రమం సభ ఏర్పాటు చేశారు శ్రీ కనకారావు. సర్దార్ మరుపిళ్ళ చిట్టి నాయకత్వం వహించారు గాంధీగారి అనుమతి సంపాదించి, విజయవాడ నుంచి ఖమ్మం వరకు ఆయనతో పర్యటించారు. అప్పట్లో అంటే 1946 లో "ఆంధ్రకేసరి" శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు అధ్యక్షులుగా, శ్రీ కళావెంకటరావు కార్యదర్శిగా ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ ప్రభజగజ్జే గీయమానంగా వెలిగి పోతుండేది. వారుభయులూ గాంధీజీ వెంట పర్యటనలో వున్నారు.

1947లో నూజివీడు జమీందారు శ్రీ ఎం. ఆర్. అప్పారావు అధ్యక్షతన ఆంధ్రనాటక కళా పరిషత్ రూపుదాల్చింది. శ్రీపసల సూర్యచంద్ర రావు (తానీషా వేషంలో బహుప్రసిద్ధుడీయన) కార్యదర్శిత్వం నెరపేవారు. శ్రీ కనకారావు కార్య వర్గ సభ్యుల్లో ఒకరు. నాలుగు దశాబ్దలపాటు ఈయన కళాపరిషత్ కార్యవర్గంలో కొనసాగారు.

అదే సంవత్సరంలో "నేషనల్ ఆర్ట్స్ థియేటర్" సంస్థాపన చేశారు శ్రీ కనకారావు, అప్పుడే గుంటూరు ఆంధ్రక్రైస్తవ కళాశాలలో పట్టభద్రులై గృమోన్ముఖులయిన శ్రీ నందమూరి తారక రామారావు, శ్రీ కొంగర జగ్గయ్య, శ్రీ కె.వి. ఎస్. శర్మ ,పుండరీకాక్షయ్య, పోలేపెద్ది శర్మ లను కలుపుకుని నాటక ప్రదర్శనలివ్వడం మొదలుపెట్టారు

## రంగస్థలం నుంచి సినిమాల్లోకి

1948లో విజయవాడ దుర్గా కళామందిరంలో ఆంధ్రనాటక కళా పరిషత్ వారి నాటిక, నాటక పోటీలు జరిగాయి. నేషనల్ ఆర్ట్స్ థియేటర్ వారు శ్రీ కొప్పరపు సుబ్బారావు రచన "చేసిన పాపం" ప్రదర్శనతో ఆపోటీల్లో పాల్గొన్నారు శ్రీయుతులు ఎన్ టి. రామారావు, కొంగర జగ్గయ్య, పుండరీకాక్షయ్య, పోలే పెద్దిశర్మ, మెట్టా రామశాస్త్రి, శ్రీమతి మల్లికాంబ నటించిన "చేసిన పాపం" ను ఉత్తమ నాటికగా న్యాయ నిర్ణేతలు తీర్పు నిచ్చారు. నాటిక నిర్వహించిన శ్రీ కనకారావును ఆ సందర్భంగా అభినందించారు. ఆ ప్రదర్శనకు హాజరయిన చలన చిత్ర నటులు, దర్శకులు శ్రీ ఎల్ వి. ప్రసాద్ మద్రాసు తిరిగి వెళ్ళిన దరిమిలా తమచిత్రం "నాదేశం"లో నటించ వలసిందిగా శ్రీయన్. టి. ఆర్. ను ఆహ్వానించి, మంచి అవకాశమిచ్చారు తరవాతి కాలంలో బి ఏ. సుబ్బారావు ప్రభృతులు ఎన్. టి. ఆర్ . కు ఎంతో ప్రోత్సాహం యిచ్చి ఇతోధిక సహాయం చేశారు. నేషనల్ ఆర్ట్స్ థియేటర్ వారు తమ సభ్యునికి ఘనంగా వీడ్కోలు చెప్పారు. అదే సమయంలో శ్రీ జగ్గయ్యకు ఢిల్లీ ఆకాశవాణి కేంద్రంలో ఉద్యోగం రావడం, వార్తలు చదువుతుండడంతో, ఆయన వాచికం, నటనా కౌశలం గుర్తించిన ప్రఖ్యాత చలన చిత్ర దర్శకులు, రచయిత శ్రీ త్రిపురనేని గోపీచంద్ తమ "ప్రియురాలు" చిత్రంలో కథానాయకుని వేషం యివ్వడంతో నేషనల్ ఆర్ట్స్ థియేటర్ కు చెందిన ఇద్దరు నటులకు సినిమా జీవితం ప్రారంభమయినట్లు.శ్రీ జగ్గయ్యకు అరుణోదయనాట్య మండలి ఆనందాశ్రువులతో వీడ్కోలు యిచ్చారు. ఇలా శ్రీ కనకారావు సంస్థలు నెలకొల్పడం, పెద్దల సమక్షంలో ప్రదర్శనలు యేర్పాటు చేయడం, తద్వారా పలువురునటులకు సినిమాల్లో అవకాశాలు రావడం, కళాకారులకు ఎంతో సంతోషమునకు కారణమయింది. ఈ కారణంగా కళాకారుల్లో ఆరోగ్య కరమైన విద్యా స్పర్ధ ఏర్పడడం, పోటాపోటీలుగా, చక్కగా పాత్రల విన్యాసంతో సహృదయోల్లాసం కలిగించడం ఆరోజుల్లో పరిపాటి అయిపోయింది. ఆ రంగస్థల ప్రదర్శనల్లో తన పాత్ర ఎంతగా వున్నప్పటికీ, తాము నిమిత్తమాత్రులమే అంటారు శ్రీ కనకారావు నిగర్వంగా, వినమ్రంగా.

## చేతులు కాల్చుకోవడం

'గయోపాఖ్యానం" అంటే ఎంతో యిష్టం శ్రీ కనకారావుకు. చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు గారి పద్యాలంటే మరీ మోజు ఆయనకు. దానితో రాజమండ్రి వెళ్ళి శ్రీ కొండపల్లి వీర వెంకయ్య గారిని కలిసి "గయోపాఖ్యానం" చలన చిత్ర నిర్మాణానికి హక్కులు కొన్నారు శ్రీ కనకారావు. మద్రాసు వెళ్ళి సర్వశ్రీ యన్. టి. ఆర్, గుమ్మడి, జగ్గయ్య, నేటి మద్రాసు ముఖ్యమంత్రిణి కుమారి జయలలిత తల్లి శ్రీమతి సంధ్యలతో ఆలోచన మొదలు పెట్టారు. జగ్గయ్య అర్జునుడుగా, గుమ్మడి గయునిగా, సంధ్యగయుని భార్యగా నిర్ణయం అయినారు. రెండు రోజులు రేవతీ స్టూడియోలో షూటింగు కూడా జరిగింది. కృష్ణుని పద్యాలు శ్రీ ఘంటసాల, అర్జునునికిపి. బి. శ్రీనివాస్, గయుని పద్యాలు శ్రీ మాధవపెద్ది సత్యం గానం చేయగా రికార్డింగ్ కూడా జరిగింది. పంపిణీకి అంగీకరించిన పూర్ణావారు, ఎన్. టి. ఆర్. కృష్ణుడుగా షూటింగ్ అప్పటికింకా జరగనందున అడ్వాన్సుగా ఆర్థిక స్తోమత సమకూర్చడానికి నిరాకరించారు. అదిగో, ఇదిగో అంటూ ఎన్. టి. ఆర్. మోహం చాటేస్తూ, గడిపారు. ఆయన గత మైత్రీ బంధాన్ని జ్ఞాపకం వుంచుకొని అయినా గౌరవించాల్సింది పోయి, సహాయ సహకారాలందించకపోవడంతో ఆ చిత్ర నిర్మాణం ఆపి వేయవలసి వచ్చింది. తీసిన సినిమారీళ్ళను ఆర్ట్ డైరెక్టర్ ఎస్. వి. ఎస్ రామారావు కు అప్పగించి చలన చిత్ర పరిశ్రమకు ఒక దణ్ణం పెట్టారు శ్రీకనకారావు. సరేలే బ్రదర్ అని మొదట్లో సంసిద్ధం కమ్మని చెప్పిన శ్రీఎన్. టి. ఆర్. ఎందుకు మొఖం తప్పించారో, ఏ దుష్టశక్తులందుకు కారణమయ్యాయో తమకు యిప్పటికీ తెలియరాలేదంటారుశ్రీ కనకారావు. ఒక 50 వేల రూపాయలు వదిలించుకుని శ్రీ కనకారావు మళ్ళీ విజయవాడ రంగంలో నే రాణించడం ప్రారంభం చేశారు. తమ సేవా కార్యక్రమాలు యథావిధిగా కొనసాగించసాగారు.

## సంఘసేవ - రంగస్థల సేవ

1949 లో బంగాళాఖాతంలో వాయుగుండం ఏర్పడడంతో నెల్లూరు, ప్రకాశం జిల్లాలు దారుణంగా నష్టపోయాయి. పేద బిక్కి బిక్కు బిక్కు మంటూ బ్రతకాల్సి వచ్చింది. గూడూ కూడు సర్వనాశనమవడంతో, తుఫాన్ బాధితుల సహాయార్థం శ్రీరామచంద్ర కాశ్యప రచన "నాదేశం" నాటకాన్ని విజయవాడలో ప్రదర్శించి రు 4,500లు దీనజనోద్ధరణ కోసం వసూలు చేయగలిగారు శ్రీ సుంకర: శ్రీ సుంకర కనకారావు తమ నాయకులు సర్దార్ మరుపిళ్ళ చిట్టి ద్వారా ఆనిధిని అఖిలభారత కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి శ్రీ కళా వెంకటరావుకు అందించారు. ఆ విధంగా బాధితులు, పీడితుల యెడ సేవా భావాన్ని శ్రీ సుంకర వ్యక్తపరచుకున్నారు. "నాదేశానికి రంగస్థలం స్థానిక శ్రీ వెలిదండ్ల హనుమంతరాయ గ్రంధాలయం అనంతరకాలంలో ఆంధ్ర నాటక ఎకాడమీ ఉపాధ్యక్షులుగా వ్యవహరిస్తున్న సమయంలో ఆరంగస్థల సౌభాగ్యం కోసం తెరలు, ఇతర పరికరాల కొనుగోలుకు అకాడమీ ఆర్థిక సహాయంగా రు 50 వేలు మంజూరు చేయించి తోమ సేవా తత్పరత ప్రకటించుకున్నారు శ్రీ కనకారావు.

1950లో శ్రీ ఎల్.వి.ప్రసాద్ తమ చిత్రం "సంసారం"లో కుమారి సావిత్రికి మంచి పాత్ర కల్పించారు. దానితోఅరుణోదయ నాట్యమండలి నుండి మరోనటి చలనచిత్ర రంగానికి కానుకగా లభించడం, మాతృసంస్థ గర్వపడేలా "మహానటి" గా సావిత్రి రూపొందటం శ్రీ కనకారావు దూరదృష్టికి మరో నిదర్శనం.

అరుణోదయ నాట్యమండలి ప్రథమ వార్షికోత్సవం జరుపుకున్నది. 1950వ సంవత్సరంలోనే విజయవాడ ఈశ్వర మహల్లో ప్రఖ్యాత దర్శకులు శ్రీ త్రిపురనేని గోపీచంద్ అధ్యక్షతన జరిగిన మహాసభలో ప్రఖ్యాత సంగీత దర్శకులు శ్రీ సాలూరి రాజేశ్వరరావు చేతుల మీదుగా శ్రీ కొంగర జగ్గయ్య, కుమారి కృష్ణకుమారి ఘన సన్మానం పొందారు. అనంతరం శ్రీ అనిశెట్టి సుబ్బారావు నాటిక "శాంతి" ని 'మద్రాసు సమాజం' ప్రదర్శించింది. సర్వ శ్రీ పద్మనాభం, వల్లంనరసింహారావు, కోదండపాణి, రెంటాల, గిడుతూరి సూర్యం, వేణుగోపాల్, బి. గోపాలం ప్రభృతులు ఆనాటకంలో పాల్గొన్నారు. ముఖ్య అతిథులుగా శ్రీ నార్లవెంకటేశ్వరరావు సినిమా రచయిత శ్రీ డి.వి. నరసరాజు, ఆచార్య సంజీవదేవ్ కూడా ఆసభకు విచ్చేశారు. శ్రీ ఎస్. రాజేశ్వరరావు, జిక్కీకృష్ణవేణి సంగీత కచ్చేరి చేశారు. కుమారి సూర్యకళ భరతనాట్య ప్రదర్శన జరిగింది.

అప్పటి వరకూ అరుణోదయ సంగీత నాట్యమండలి ద్వారా నాట్య ప్రదర్శనలు యిస్తున్న కుమారి వహీదారహమాన్‌ను శ్రీ కనకారావు వెండితెరకు పరిచయం చేశారు. నటులు శ్రీ ఎన్.టి.ఆర్. దర్శకులు యోగానంద్‌ల ద్వారా "జయసింహ" లో వేషం యిప్పించారు శ్రీ కనకారావు. సారథీ స్టూడియోస్, హైదరాబాదు అధినేత శ్రీ రామకృష్ణప్రసాద్ తమ చలనచిత్రం "రోజులు మారాయి' లో వహీదాకు 'నర్తకి' గా అవకాశం యిచ్చారు. రెండు చిత్రాల్లో నూతన ప్రతిభ నిరూపించుకుని, హిందీ చలనచిత్ర ప్రపంచంలో గూడా అందాల నటిగా తారాపథం చేరుకున్న శ్రీమతి వహీద ~మాన్ ప్రతిభారాణికెక్కడానికి శ్రీ కనకారావు నిస్వార్థ కృషి కారణంకాదని ఎవరైనా అనగలరా. వహీదా అయినా. కాని, కృతజ్ఞతా పూర్వకంగా ఆమె శ్రీ కనకారావును గుర్తుంచుకుంటుందా! కనీసం తలచుకుంటుందా ఎప్పుడైనా! అని అనుమానం.

కృతజ్ఞత ఆశించకుండా, నిస్వార్థంగా మిత్రుల, అనుచరుల, కళాభివృద్ధి అనవరతం కాంక్షిస్తూ, అదోతపస్సుగా కళా రాజకీయ రంగాలకు సేవా దృక్పథంతోనే అంకితమయిన శ్రీ కనకారావు లాంటి వారు "నభూతోనభవిష్యతి" అంటే కాదనే వారున్నారా? నమ్మలేని నిజాలు అంశాల్లో యిదో చెప్పదగిన అంశంకాదా!

"కనకారావు" అని పేరు పెట్టడంలోనే మహనీయులు శ్రీ స్వామి చాలా మంచి పని చేశారు. కనకం అంటే బంగారపు ఆభరణాలు చేయడానికి పనికి వస్తుందనేవి జగద్విితం. ఆ ఆభరణాలు ధరించిన, వారికి వన్నెతెస్తాయి. అందమిస్తాయి. కాని ఒకరు ధరించినందు వల్ల ఆభరణానికి కీర్తిరాదు. ఈ విషయం శ్రీ కనకారావు పట్ల వాస్తవం అని రుజువయింది. కళాకారులుగాని, రాజకీయ నాయకులుగాని, అంచెలు అంచెలుగా అనేక పదవులు, హోదాలు, ఆర్థిక పటిష్టత, కీర్తి ప్రతిష్టలు పొందుతారు. అనుభవిస్తారు. అయితే కనకారావు మాత్రం చిరునవ్వులు చిందిస్తూ, నిరాడంబరంగా ఎప్పుడూ వున్నట్లే వుంటారు. "ఇదంతా మీ చలవే"అని ఎవరైనా అంటే. "నాదేముంది అంతా భగవంతుని దయ" అంటారు నిర్లిప్తంగా, నమ్రతగా. పైగా "వాళ్ళ అదృష్టం. అవకాశం వచ్చింది. అలా సద్వినియోగం అయింది" అంటారు. ఏమీ ఎరగనట్లు, తమ పాత్రేమీ లేనట్లు, అంతాముట్టనట్టుగా అదీ శ్రీ కనకారావు వ్యక్తిత్వం. "బహుజనహితాయ, బహుజనసుఖాయ" అనేదే ఆయన దీక్ష, ఆశయం.

ఎవరో వస్తారని, ఏదో చేస్తారని ఎదురు చూస్తూ, చేతులు ముడుచుకుని కూర్చొనడం పట్ల శ్రీ కనకారావుకు ఏ మాత్రం విశ్వాసంలేదు. "గొప్ప వాగ్దానం కన్నా, చిన్న పని చేసి చూపడం ఉత్తమ" మనే సూక్తి ఆచరణకు తమ జీవితంలో ప్రధాన స్థాన మిచ్చిన వ్యక్తి శ్రీ సుంకర కనకారావు.

అక్టోబర్ నెలలో పుట్టిన వ్యక్తి స్నేహాలపుట్ట, స్నేహం చేస్తాడు, ఆ స్నేహం నిలుపుకుంటాడు. తన ప్రక్క నడచినవారి అభివృద్ధి దోహదకారి అవుతాడు. కాని తను అలాగే వుంటాడు. శ్రీ కనకారావు హస్తాలు పరీక్షించిన బెంగుళూరు జ్యోతిష్యులు శ్రీ ఆర్.జి. రావు. 1964లో అనిన మాటలవి. 28వ సంవత్సరాల క్రితం చెప్పిన ఆ వాక్యా అక్షరసత్యాలుగా నిరూపణ అయినాయి. తనకున్నవి మూడే కోర్కెలు. తిండి, గుడ్డ, గూడు, బ్రతికినంత కాలం యిచ్చింది దానితో గడవడం. తను రోజూ భగవంతుడ్ని "మూడు యిచ్చావు తండ్రీ! వాటిని మాత్రం వెనుక్కు తీసుకోకు" అని ప్రార్థిస్తాను అన్నారు శ్రీ కనకారావు. ధనం చూపి ఐశ్వర్యం చూపి మంచి మిత్రుల్ని, వారి అప్యాయతల్ని, ఆదరాన్ని కొనలేమని శ్రీ కనకారావు విశ్వాసం. ఆ నమ్మకం యీ సుదీర్ఘమైన తమ జీవితంలో ఎప్పుడూ వమ్ము కాలేదని శ్రీ కనకారావు తరచూ చెప్పేమాట. ఆయనకు ఎంతో మంది పెద్దల పిన్నల సాంగత్యం అబ్బింది. "ఈనాటికీ 'మా కనకారావు' అని ఏకవచనంలోనే అభిమాన పరస్పరంగా కౌగలించేవారు. చేతులు కలిపేవారు ఎంతో మంది వున్నారు తమకు. "స్నేహపాయసం ఎంత రుచి అని మురిసి పోతారు శ్రీ కనకారావు. అందుకనే ఆయన కనకానికి సుంకం వసూలు చేసేవాడు. అంటే మంచి తనాన్ని యితరుల నుండి పొందేవాడు. మంచి సమకూర్చేవాడు. ఈ యిచ్చిపుచ్చుకోవడాలు కొందరి వ్యక్తుల్లో అపశృతులుగా, మిగిలి పోవచ్చు. కానీ శ్రీ కనకారావు మాత్రం "సంతోషిమాత" పుత్రుడు. సంతోషాన్ని యిస్తాడు. సంతోషాన్ని పొందుతాడు.

"అరుణోదయ నాట్యమండలి" వేదిక మీద శ్రీ కనకారావు సన్మానించిన ప్రముఖ, బహుముఖ ప్రజ్ఞావంతుల్లో మరికొందరు. సర్వ శ్రీ డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, కళా వెంకటరావు, దామోదరం సంజీవయ్య, పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి, .ఎ.సి. సుబ్బారెడ్డి, పిడతల రంగారెడ్డి, బూర్గుల రామకృష్ణారావు, డాక్టర్. కె.ఎల్. రావు, డాక్టర్ కొమర్రాజు అచ్చమాంబ, అనగాని భగవంతరావు, జలగం వెంగళరావు, టంగుటూరి అంజయ్య, పెండేకంటి వెంకట సుబ్బయ్య, మండలి వెంకట కృష్ణారావు, భాట్టం శ్రీరామమూర్తి, అయ్యదేవర కాళేశ్వరరావు, ఎస్.బి.పి. పట్టాభిరామారావు, చల్లపల్లి రాజాబహద్దర్, లుకలాపు లక్ష్మణదాసు, యం.ఆర్. అప్పారావు, పసల సూర్యచంద్రరావు, అద్దంకి శ్రీ రామమూర్తి, వి. శాంతారాం, పృధ్వీరాజ్‌కపూర్, హెచ్.ఎం.రెడ్డి, బి.ఎన్.రెడ్డి, ఎల్.వి. ప్రసాద్, చిత్తూరు వి. నాగయ్య, ఎన్.టి. రామారావు. యస్.వి. రంగారావు, కొంగర జగ్గయ్య, మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, చింతలపాటి సీతారామచంద్ర వరప్రసాదమూర్తి రాజు, ద్వారం వెంకటస్వామి నాయుడు, సాలూరి రాజేశ్వరరావు, మంగళంపల్లి బాలమురళీకృష్ణ, కోరాడ నరసింహారావు, నటరాజ రామకృష్ణ, విశ్వనాథ సత్యనారాయణ, చిలుకూరి నారాయణరావు, పింగళి లక్ష్మీకాంతం, త్రిపురనేని గోపీచంద్, ఆచార్య ఆత్రేయ, పినిశెట్టి శ్రీరామమూర్తి, జొన్నలగడ్డ సత్యనారాయణ, డా.సి. నారాయణ రెడ్డి, కె.వి. గోపాలస్వామి నాయుడు, డి.వి. నరసరాజు, రెంటాల గోపాలకృష్ణ, నీలంరాజు వెంకటశేషయ్య, ఇంటూరి వెంకటేశ్వరరావు, కారుమంచి వెంకటసుబ్బయ్యచౌదరి, బి.వి. నరసింహారావు, వింజమూరి వరద రాజయ్యంగార్, అక్కినేని నాగేశ్వరరావు, తదితర ప్రముఖులు. మహిళా ప్రవీణుల్లో శ్రీమతులు. పి. భానుమతి,జమున, సావిత్రి, కృష్ణకుమారి, షావుకార్ జానకి, లక్ష్మీరాజ్యం, సూర్యకాంతం, హేమమాలిని, వహీదారహమాన్, తారాచౌదరి, యామినీ కృష్ణమూర్తి ప్రముఖులు. ఇంకా స్థలాభావం వల్ల అందరి పేర్లు యివ్వ లేక పోతున్నందుకు క్షంతవ్యుడ్ని.

ఒక విషయాన్ని తెలుసుకోవడం విజ్ఞాన సముపార్జన క్రిందకు వస్తుంది. అలా సంపాదించినవిజ్ఞానాన్ని జీవితపథంలో వినియోగించు కోవడం విజ్ఞత క్రిందకు వస్తుంది. అయితే జీవితగమ్యం విజ్ఞానార్జనతోనే ఆగిపోతే ప్రయోజన రహితం అవుతుంది. లక్ష్యసాధనమే జీవిత పరమార్థం కాబట్టి విజ్ఞత ఆర్జించిన విజ్ఞానాన్ని సద్వినియోగపరచడం ప్రధమ కర్తవ్యం. కర్తవ్యసాధనకు అన్నిటికన్నా ఆత్మ విశ్వాసం అత్యంతావశ్యకం. అది దండిగా వున్నకార్యశూరుడు, కర్మవీరుడు శ్రీ సుంకర కనకారావు. పుట్టుకతో లక్ష్మీపుత్రుడుకాదు. అడ్డదారుల్లో అందినంతలో సంపాదించి ఐశ్వర్యానికి ప్రతీకగా కుబేరవిలాసాలు అనుభవించిన, అనుభవిస్తున్న ధనవంతుడు కాదు. పెద్ద చదువులు (డిగ్రీలే కొలతబద్దలయితే) కొనేవారు. విద్వాంసుల లెక్కలోకిరారు. అనుభవజ్ఞుడు. ఆ అనుభవాల ద్వారా ఆర్జించిన స్నేహార్థహృదయ సౌకుమార్యం. స్నేహశీలం, పరోపకారి బుద్ధి సంతరించుకున్న మహావిద్వాంసుడు శ్రీ కనకారావు. మహనీయ ప్రజ్ఞాపాటలకు

ఆలవాలమైన, నిజాయితీ నిలుపుకున్న విజ్ఞానఖండం ఆయన. అందుకనే ఎంతోమంది పెద్దలను, కళాకారులను, రాజనీతి వేత్తలను, ఉద్యమ నిర్వాహకులను పండిత ప్రకాండుల విజయవాడకు తీసుకు రాగలిగాడు. అదర పురస్కారాలతో సన్మానించగలిగాడు. ఎన్ని బృహ త్కార్యాలు చేయగలిగాడు ఆయనొక్కడే.

సత్కార్యాలు చేయడంలో అయన ఆలోచనలు చిత్రాతిచిత్రాలు. గొప్పవాగ్దానాలు చేయడు. ఏదో ఒక చిన్న కార్యక్రమమైనా జరిపి తీరుతాడు. కార్యశూరుడు కావడంతో కాలం, ధనం అతడికి సమస్యలు కావు. వాటంతట అవే సమకూరేవి. లేదా అలా సమకూర్చడానికి తగిన చిట్కాలు నేర్పుగా ప్రయోగించడంలో సమర్థుడు. ఆవిధంగా రాజకీయ కళారంగాల్లో విజయ పరంపర శ్రీ కనకారావుకు పాద్రా కాంతమయింది. ఇందులో అతిశయోక్తి లేదు. ఆశ్చర్యమంత కంటే లేదు.

1965లో "జాతీయ రక్షణనిధి" కోసం శ్రీ నందమూరి తారక రామారావు ఆధ్వర్యంలో, శ్రీ కనకారావు తాను కార్యదర్శిగా విరివిగా సంచారం చేసి రు.21/2 లక్షల నిధి ప్రోగు చేయగలిగారు. 45న వారు నిర్వహించిన యిన్ని సన్మానకార్యక్రమాల్లోగాని, వసూళ్ళ కార్యక్రమంలోగాని, ఆర్థిక కొరత కారణంగాగాని, అంగబలం లేని కారణంగాగాని ఆగిపోయిన ఒక్క సంఘటన, మచ్చుకుగూడా లేదు. శ్రీ కనకారావు మేధాశక్తియుక్తులకు ఆయన విజయాలే నిదర్శనాలు.

## తిరిగి రాజకీయాలు

మళ్ళా రాజకీయరంగం తిరిగి ఒకసారి శ్రీ కనకారావు రాజకీయ జీవితం వైపు మన దృష్టి మరలిద్దాం.

1952 లోనే శ్రీమతి ఇందిరాగాంధీచే హిమాచల ప్రదేశంలోని "ఖద్రాల్""లో ప్రారంభించబడిన యువజన కాంగ్రెస్ శిబిరంలో ఈ సందర్భంగా శ్రీ ఎన్.టి.ఆర్. తన బృందంతో నిధి సంపాదనకై నాటికలు ప్రదర్శించారు. ఈ సందర్భంగా బెజవాడ జింఖానక్లబ్ ఆవరణలో నాటిక ప్రదర్శనలు జరుగుతుండగా శ్రీ కనకారావు ఎన్.టి.ఆర్. కు "నటరత్న" బిరుదు ప్రదానం చేస్తూ పుష్పమాలా లంకృతుని చేశారు. ఈ నిధి వసూళ్ళ కమిటీకి ఆనాటి కృష్ణాజిల్లా కలెక్టర్ శ్రీ జయకర్ జాన్సన్ అధ్యక్షులు శ్రీ కనకారావుగారు కార్యదర్శి.

ఈ నాటికీ శ్రీ రామారావు తమ అన్ని బిరుదుల కన్నా "నటరత్న" బిరుదును ఎంతో గొప్పగా చెప్పుకుంటారు. శిక్షణ పొందటానికి శ్రీ కనకారావుకు అవకాశం అభించింది. అప్పట్లో విజయవాడ పట్టణ కాంగ్రెస్‌కు డాక్టర్ జంధ్యాల దక్షిణామూర్తి అధ్యక్షులుకాగా శ్రీ సుంకర కనకారావు కార్యదర్శి. 40 రోజుల పాటు రాజకీయ శిక్షణ భాగ్యాన్ని పొందారు. రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ నీలంసంజీవరెడ్డిగారు ఈ అవకాశం కల్పించారు. వీరితోపాటు పట్టణ యువజన కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ పట్టానేని తిమ్మేశ్వరరావు కూడా ఈ శిబిరంలో శిక్షణ పొందారు.

1949లో వార్ధాలో గాంధీగారి ప్రథమ వర్ధంతి సందర్భంగా మూడు రోజులు గడిపారు శ్రీ కనకారావు. డాక్టర్ పట్టాభి, పండిట్ జవహర్‌లాల్‌నెహ్రూ, సర్దార్ వల్లభాయ్ పటేల్, కొండా వెంకప్పయ్య, మౌలానా అబ్దుల్ కలాం అజాద్, శంకరరావుదేవ్, డాక్టర్ రాజకుమారీ అమృతకౌర్, "భారతకోకిల" శ్రీమతి సరోజినీదేవి, చక్రవర్తి రాజగోపాలాచారి, బాబూ రాజేంద్రప్రసాద్, బాబూ జగ్‌జీవన్‌రావు, గుల్జారీ లాల్‌నందా, అరుణా అసఫాలీ లాంటి జాతీయనాయకులతో పరిచయం, సాహచర్యం, సేవ చేసే భాగ్యం శ్రీ కనకారావుకు కలిగాయి. శ్రీ గోపరాజు రామచంద్రరావు, ప్రసిద్ధ గాంధేయ వాదులు, నాస్తికోద్యమ నిర్మాతగారి పుత్రిక వివాహం శ్రీ అర్జున్ అనే హరిజన బాలునితో, ఆశ్రమంలో ఆ రోజుల్లోనే జరిగింది. శ్రీ కొండా వెంకటప్పయ్య, శ్రీ జయప్రకాష్ నారాయణ వివాహానికి అధ్వర్యం వహించారు. ఆరోజును తలచుకుని, ఆనాడు తాము పొందిన ఆనందం ఈనాడు కూడ పొందుతుంటారు శ్రీకనకారావు.

1949లోనే రజాకార్ ఉద్యమం ప్రబలింది. వారి మత విద్వేష కారణంగా కష్ట, నష్టాలకు గురి అయిన తెలంగాణా ముస్లిమేతరులు భారీగా నష్టపోయారు. భీతితో కాందిశీకులై పారిపోయి అందిన రైలుపట్టుకుని సర్కారు జిల్లాలను పరుగున వచ్చేవారు. వారి ఆలనా పాలనా ఎలా? ఎవరు చూస్తారు. గొప్పవారు వాళ్ళు తెచ్చుకున్న ముల్లెమూటలతో అక్కడక్కడ వసతి సౌకర్యాలు కల్పించుకున్నారు. మధ్యతరగతి, బీద జనం బాధలు వర్ణనాతీతం. "భారత సేవకసమాజ' 'అధ్యక్షులుగా పదవీ బాధ్యతలు మోస్తున్న శ్రీ సుంకర కనకారావు కాందిశీకుల రక్షణ బాధ్యతలు తీసుకోవాలని సంకల్పించి, విజయవాడలో పలుచాట్ల వారికి వసతి, భోజన సదుపాయాలు కల్పించడానికి అహరహం కృషి చేసి, ఆ సత్కార్యంలో విజయ ఢంకా మ్రోగించారు. తనదైన బాణీలో తన పరివారం , సహాయం పొందుతూ చక్కటి సేవాకార్యక్రమాలు నిర్వహించారు.

## పత్రికా నిర్వహణ

ఆదర్శాలను ప్రచారం చేయడానికి మంచి మార్గాన్ని ఆలోచించి 1952లో కృష్ణాజిల్లా ముఖ్యపట్టణమయిన మచిలీ పట్నంలో

"నవీనాంధ్ర" పత్రిక స్థాపించారు. శ్రీ చదలవాడ పిచ్చయ్య, మండలి వెంకట కృష్ణారావు, జి. రాధాకృష్ణలతో పాటు శ్రీ సుంకర కనకారావు సంపాదక వర్గ బాధ్యతలు స్వీకరించి, కొన్నాళ్ళ పాటు పత్రికారంగంలో కృషి చేశారు.

బాల్యంనుండీ కాంగ్రెస్ పార్టీ తరపున ఎన్నికల్లో, ఎన్నికల సభల్లో పాల్గొనడం వల్ల, జాతీయ నాయకులతో శ్రీ కనకారావుకు గట్టి సంబంధాలు ఏర్పడ్డాయి. శ్రీ సుంకర కనకారావు నిజాయితీ, కార్యదీక్షలకు ముగ్ధులయిన శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు శ్రీ కనకారావును తమ "దత్తపుత్రుడని అందరికీ చెప్పేవారు. కాంగ్రెస్‌పార్టీ తరుపున ప్రచారం చేయాలనే లక్ష్యంతో, తనదైన తరహాలో విజయవాడ నించి "అరుణోదయ" వారపత్రిక ప్రచురణ ప్రారంభించారు. ఆనాటి ప్రసిద్ధ పత్రికా రచయిత శ్రీమాగాపురామన్ సంపాదకులుగా, తాము మేనేజింగ్ ఎడిటర్‌గా "అరుణోదయ" ఒక శుభోదయాన వెలుగు చూచింది. "దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్" అనే మహాకవి గురుజాడ గేయ చరణం ప్రముఖంగా ప్రథమసంచికలో ప్రచురణ అయింది. ఈ సంచిక 1954 సెప్టెంబర్ 1న మార్కెట్‌లోనికి విడుదల అయింది. అరుణోదయ కోసం ఆ రోజుల్లోనే స్వంతసొమ్ము రు12 వేలు వెచ్చించారు శ్రీ కనకారావు.

ప్రథమ సంచికకుఆనాటి రాష్ట్రపతి శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ, రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి, ఆర్థిక, న్యాయశాఖమంత్రి శ్రీ తేన్నేటి విశ్వనాథం, పార్లమెంటు సభ్యులు ప్రఖ్యాత రచయిత డాక్టరు లంకసుందరం, స్పీకర్ శ్రీ జి.వి. మౌలంకర్, కేంద్ర సాంఘిక సంక్షేమ బోర్డు ఛైర్మెన్ శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్‌ల ఆశీర్వాదాలు లభించాయి.

విజయవాడ పట్టణానికి సమీపంలోని గన్నవరంలో విమానా శ్రయం వున్నా, వర్తక వాణిజ్యాలకు, ప్రభుత్వకార్యాలయా లకు కేంద్రమయినా, రాష్ట్రం నడిబొడ్డులో వున్న మహానగరమయినా, విమానాల రాకపోకలకు తగిన ఏర్పాట్లు లేక పోవడం, ఆనాటి కేంద్ర కమ్యూనికేషన్ శాఖామంత్రి శ్రీ బాబు జగజీవనరాం గారికి విమానాశ్రయ అవసరాన్ని వివరిస్తూ ఒక మెమోరాండంను సమర్పించారు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు ఆవిజ్ఞాపన పత్రంలో సంతకం ఆయనతో పాటు, పట్టణ కాంగ్రెస్ అధ్యక్షులు సర్దార్ శ్రీ మరుపిళ్ళ చిట్టి, ఫిలించెంబర్ కార్యదర్శి శ్రీ అయ్యంగార్. బట్టల వర్తకుల సంఘ అధ్యక్షులు శ్రీమాజేటి రామమోహనరావు. మనకథానాయకులు ఆంధ్ర యువజన కాంగ్రెస్ ఆర్గనైజర్ శ్రీ సుంకర కనకారావు వున్నారు. కొంత కాలానికి శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, శ్రీ బూర్గుల రామకృష్ణారావు, శ్రీ వల్లూరి బసవరాజు తదితర ప్రముఖుల ఆధ్వర్యంలో విశాలాంధ్ర ఉద్యమం మొదలయింది 1955లో. ఈ సందర్భంగా విజయవాడలో ప్రముఖ కాంగ్రెస్ నాయకులు స్థానిక పారిశ్రామిక వేత్త " సిరీస్‌రాజుగా' విఖ్యాతులయిన శ్రీ జి.ఎన్.రాజుగారి గృహప్రాంగణంలో శ్రీ అయ్యదేవర వారి అధ్యక్షతన శ్రీ కనకారావు సారధ్యంలో విశాలాంధ్ర ఉద్యమంపై ప్రథమ సమావేశం ఏర్పాటు అయింది. చారిత్రాత్మ కమయిన ఈ సమావేశంలో మొట్టమొదటిసారిగా రాయలసీమ నాయకులు శ్రీ రాజగోపాల శెట్టి, మైసూర్ శాసన సభ్యులు శ్రీమలకా గోవింద రెడ్డి, జగదల్ పూర్ మునిసిపాలిటీ ఉపాధ్యక్షులు శ్రీ కె.వి. నరసింహారావు. ఆర్.ఎస్.వెంకటేశం. సారాదుల్లాఖాన్, కె. నరసింహాచారి, యస్ గౌతమ్, మీర్ మహమ్మదాలీఖాన్, కొత్తూరి సీతయ్య గుప్త, చారి, పాగుపుల్లరెడ్డి వెంకట్రామారావు, బి.వి. గురుమూర్తి, గౌతమరావు, బొమ్మ కంటి సత్యనారాయణరావు, వట్లూరి బసవరాజు, వెంకటాచలం, లక్ష్మీనరసయ్య, బాలచంద్ర శ్రీనివాసరావు, ఆర్.శ్రీరామమూర్తి హాజరయినారు వీరిడిమాండ్ ఫలితంగా "పండిట్ నెహ్రూ" ఫజుల్ అలీకమిషన్"ను నెలకొల్పి విజయవాడకు పంపటం జరిగింది. కమీషన్ సభ్యులు, సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ సభ్యులు శ్రీ హృదయ నాథకుంజ్రూ విజయవాడలో అడుగు బెట్టారు. తరువాత సర్దార్ ఫణిక్కర్ విచ్చేశారు.

1955లో శ్రీ సుంకర కనకారావు విజయవాడ రైల్వే కన్సల్ టేటివ్ కమిటీ సభ్యులుగా నియామకం పొందారు. ఆరోజుల్లో పేరుకు మాత్రం విజయవాడ జంక్షన్ స్టేషన్. ప్రయాణికుల సాయాన్ని భద్రపరచుకుని వసతి సౌకర్యం విజయవాడలోనే కాదు ఆంధ్రదేశంలో ఏ రైల్వే స్టేషన్‌లోను లేదు. విజయవాడ రైల్వే ప్లాట్ ఫారం మీద వాన నీళ్ళు నిలవవుండి పార్సిళ్ళు తడిసిపోయేవి. వాన కురిస్తే ప్రయాణీకులు తడిసి ముద్ద అయ్యేవారు. పార్సిల్ బేళ్ళు పాసెంజెర్లుతో తీరిగ్గా, గంటల కొద్ది ఆలస్యంగా నడిచేవి. విజయవాడ నుంచి రాష్ట్ర రాజధాని హైదరాబాదు వెళ్ళడానికి ఉదయం ఒకటి సాయంత్రం మరొకటి పాసెంజెర్ రైళ్ళు నడిచేవి.

ప్రత్యేక రైల్వే జోన్ లేకపోవడంతో సరుకు రవాణా అవసరాల కోసం వాగన్లు సంపాదించడం అత్యంత కష్టతరం అయ్యేది అన్నింటికి మద్రాస్ రైల్వే మండలం సంపాదిస్తే గాని యితోధిక అభివృద్ధి సాధించడం సాధ్యం కాదనే నమ్మకం. ఆంధ్రోద్యోగులకు ప్రయోషన్లు అయినా దొరికేందుకు అవకాశాలు వస్తాయనే ఆశాభావంతో పార్లమెంటు

సభ్యురాలు డాక్టరు శ్రీమతి అచ్చమాంబగారితో కలసి శ్రీ కనకారావు చేసిన కృషి అనితర సాధ్యం. ఢిల్లీ దాకా తమ ఆందోళన కొనసాగించి ఆనాటి ప్రధాని శ్రీ జవహర్‌లాల్ నెహ్రూజీకు ఆంధ్రుల దయనీయ స్థితి వివరించి. ఎటకేలకు ఆంధ్రులకు ప్రత్యేక రైల్వే మండలం "దక్షిణ మధ్య రైల్వే మండలం" సాధించిన ఘనులు శ్రీ కనకారావు. విశ్వామిత్ర మహర్షి చేసిన ప్రతిపనీ లోకానికి నిజం తెలియజేయడానికి. అవతల అవస్థలు పడ్డవాడి నిజాయితీ సమాజం ముందు తెరిచిన పుస్తకంలా వుంచడానికి ఉపయోగపడ్డట్లే.) శ్రీ కనకారావు ఈ కృషి ఆంధ్రుల వరమయింది. అయితే కొందరు మాత్రం తిట్లు, శాపనార్థాలు ఈయనకూ మిగిల్చారు.

ఈయన పరిచయం చేసిన ఎన్.టి.ఆర్, జగ్గయ్య, సావిత్రిలు సినిమాల్లో ప్రఖ్యాత నటులుగా జీవించినా, వహీదారహమాన్ హిందీ సినిమాలు గూడా అసమాన ఖ్యాతి గడించినా, మరెందరో ఎన్నెన్నో కీర్తికిరీటాలు ధరించినా శ్రీ కనకారావు కున్న ఆస్తి తరిగి పోవడం, అనేక సార్లు అవమానాలు, కష్ట నష్టాలకు గురికావడం జరిగింది. చివరికి చిన్న యిల్లు మాత్రం మిగిలింది. కనీసం స్వాతంత్ర సమర యోధునిగా భూమి కూడా ప్రభుత్వం యివ్వలేదు. ఇంతకంటే కాంగ్రెస్ వారి కృతఘ్నతకి నిదర్శనం మరేమైనా వుంటుందా! అయినా శ్రీ సుంకర చిరునవ్వు వడలిపోలేదు. కించిత్తు గూడా ఆయన బాధపడలేదు. ఏ మాత్రం తొణక లేదు. బెణక లేదు. కాంగ్రెసు శాసనసభ్యులు, పార్లమెంటు సభ్యులు ఎన్నికల్లో ఉపన్యాసలివ్వడం వారికి సహాయపడటం గెలిపించడం ఆయనకు తృప్తిగా మిగిలింది తప్ప వారేమీ పదవులు ఆశించడంలేదు.

ఇతరులను నిందించడానికి ఉద్యుక్తుడు కాలేదు. 72వ సంవత్సరం వస్తున్నా ఈ తరుణంలో గూడా వళ్ళు విరుచుకుని చేతనైన సహాయం చేయడానికి ఏ మాత్రం ఏమరడం లేదు. "నిష్కామ కర్మయోగిగా" శ్రీ కనకారావు చరిత్ర పుటల్లో మిగిలి పోతారనడానికి మరేమీ సాక్ష్యం అక్కర్లేదు.

1964 వచ్చింది. రైల్వే మండలం సంగతి ప్రస్తావిస్తాను. దక్షిణ మధ్య రైల్వే ప్రధానా కార్యాలయం నెలకొల్పాల్సిన సందర్భంలో అప్పటి రైల్వేల మంత్రి శ్రీ ఎస్.కె.పాటిల్ సికింద్రాబాద్ వచ్చారు. "రైలు నిలయం" శంకుస్థాపన జరిగింది. అదే ఈనాడు సికింద్రాబాద్‌లో రైల్వే జనరల్ మేనేజరు కార్యాలయం. ప్రభుత్వంతో పోట్లాడి విజయవాడ, సికింద్రాబాదుల మధ్య ఎక్స్‌ప్రెస్ రైళ్ళు రాకపోకలను ఏర్పాట్లు జరిపించడంలో చిట్టచివరకు విజయం సాధించారు శ్రీసుంకరం. 1967లో విజయవాడ సికింద్రాబాదుల మధ్య "గోల్కొండ" ఎక్స్‌ప్రెస్ రాకపోకలు ప్రారంభించింది. ఆనాటినుండి అనేక ఎక్స్‌ప్రెస్ బండ్లు కాలక్రమీణ నడపబడుతున్నాయి. విజయవాడ జంక్షన్ ఆనాటి నుంచి దినదినాభివృద్ధి చెంది ఈ రోజుకు ఏ స్థాయిలో వున్నదో జగద్విఖ్యాతం. గొప్ప పనికి, ఇంత అభివృద్ధి వెనుక ఒక సామాన్య కార్యకర్త, వినయమూర్తి, నిగర్వి, సాధుపుశీలవంతుని నిరంతర కృషి వున్నదని నాబోటి వారు వివరిస్తే తప్ప లోకానికి తెలియదు గదా! శ్రీ సుంకర ఆయనగా ఎవ్వరికి చెప్పుకోరు.

సుంకరకు పొగిడించుకోవటం సుతారాంగిట్టదు. ఇవన్నీ వ్రాస్తానంటే "ఎందుకండి భగవంతుని విశ్వరచనలో యెలా యే పని ఎవరి ద్వారా జరగాలో అలాగే జరుగుతుంది. నా ప్రమేయం ఎంత! నేనెంత?"అంటారు సౌమ్యంగా. అయినా మన ఆంధ్రుడు మనకోసం చేసిన కృషి, సాధించిన గొప్ప కార్యాలు మనం ఎలా విస్మరిస్తాం? సమయం వచ్చినప్పుడయినా చెప్పుకోకుండా ఎలా? చెప్పకపోవడం దర్మమనిపించుకోదుగదా!

కేంద్ర రైల్వే మంత్రిత్వ శాఖ శ్రీ కనకారావు కృషిని గుర్తించింది. 1966లో తిరిగి ఆయన్ను రైల్వే జోనల్ సలహామండలి సభ్యులుగ నియమించింది.

1957వ సంవత్సరం శ్రీ సుంకర కనకారావు జీవితం పై అమృతం కురిసిన సంవత్సరం అని చెప్పుకోవచ్చు. 1957 ఏప్రియల్ 27, 28,లలో అరుణోదయ సంగీత నాట్య మండలి ద్వాదశ (12వ) వార్షికోత్సవ మహాసభలు జరిపించారు శ్రీ కనకారావు. శ్రీ సిరీస్ రాజు ఆహ్వాన సంఘ అధ్యక్షత బాధ్యత స్వీకరించారు. మొదటి రోజు కార్యక్రమానికి అనాటి మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి సుప్రసిద్ధ నాటికా రచయిత శ్రీ పాకాల రాజమన్నారు అధ్యక్షత వహించారు. ఆంధ్రప్రభ సంపాధకులు శ్రీ నార్ల వెంకటేశ్వరరావు సభలను ప్రారంభించారు. ప్రముఖ నాట్యాచార్యులు శ్రీ.డి. వేణుగోపాల్, శాంతిల భరతనాట్యం, "ప్రతీక్ష" నాటికా ప్రదర్శనలు జరిగాయి. ప్రముఖ కవి శ్రీ సినారె, డి.వి. కృష్ణయ్య, చల్లపల్లి రాజా ఈ కార్యక్రమాలలో పాల్గొన్నారు.

రెండవరోజు కార్యక్రమానికి అనాటి రాష్ట్ర విద్యాశాఖా మంత్రి శ్రీ ఎస్.బి.పి. పట్టాభి రామారావు అధ్యక్ష స్థానం అలంకరించగా, ప్రఖ్యాత పారడీ రచయిత శ్రీ జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి రచన "కన్యకా పరమేశ్వరి" నాటకం ప్రదర్శించారు. మహా పండితులు ఆచార్యులు పింగళి లక్ష్మీకాంతం కూడా పాల్గొన్నారు. ఈ మహా సభలు షెహన్‌షా మహల్ (ఈనాటి నవరంగ్ టాకీసు)లొ జయప్రదంగా జరిగాయి.

ఇతర జిల్లాల నుండి వసూలైన రూ. 3.5 లక్షలను కలిపిమొత్తము 6 లక్షల మొత్తాన్ని ఆనాటి రాష్ట్ర ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానంద రెడ్డి ద్వారా ప్రధాని శ్రీ లాల్ బహదూర్ శాస్త్రికి అందజేసారు.ఆ కార్యక్రమము హైదరాబాదులోనే జరిగింది. ఈ నిధి సంపాదనలో చలన చిత్ర నటులు ఎన్.టి. ఆర్. ప్రధాన పాత్ర తీసుకొని మహానటులని ప్రోత్సహించి నిధి వసూళ్ళకు ఇతోధిక సహాయం చేసారు. "ఆరోజులు మరపు రానివి అంటారు శ్రీ కనకారావు.

చతుష్షష్టి కళల్లో వ్యాయామ కళకు కూడా ఒక స్థానం ఉన్నది కదా! కళా పిపాసి కళామతల్లి ముద్దుబిడ్డ శ్రీ కనకారావు 1967 లో నుండి 1969 వరకు కృష్ణా మండలి వెయిట్‌లిఫ్టర్స్ అసోసియేషన్ అధ్యక్షులుగా ఉన్న సమయంలోనే విజయవాడలో సత్యన్నారాయణ పురం బస్‌స్టాండ్ సమీపంలో పార్కు ప్రదేశాన్ని మునిసిపాలిటీ అనుమతితో "మారుతీ వ్యాయామశాలను" రూపకల్పన చేసారు. నేటికీ ఆ వ్యాయామశాలలో యువకులు కసరత్తు చేస్తూ ఉంటారు. ఆ శాల ఆవరణలోనే ఆంజనేయ స్వామి ఆలయముకూడా నెలకొల్పారు.

1970 లొ శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డి ఆధ్వర్యములోజరిగిన అఖిల భారత కాంగ్రెస్ మహా సభల్లో శ్రీ కనకారావు ఆంధ్రప్రదేశ్ కాంగ్రేస్ సభ్యులుగా పాల్గొన్నారు. విజయవాడ రైల్వే ఇన్‌స్టిట్యూట్‌లో పెద్ద ఎత్తున "ఆంధ్ర నాటక కళాపరిషత్" జరిపిన కార్య కలాపాలకు శ్రీ కనకారావు ఆహ్వాన సంఘ ప్రధాన కార్యదర్శిగా, మునిసిపల్ చైర్మన్ శ్రీ గద్దె పూర్ణ చంద్ర రావు అధ్యక్షులుగా శ్రీ నర్రా గోపాల కృష్ణయ్య కోశాధికారిగా కంకణం కట్టుకున్నారు.హాజరయిన చాలా మంది సభ్యులకు వసతి భోజన ఏర్పాట్లు సరిగా జరగక అభాసుపాలవుతున్న సందర్భములో వారందరికి వించిపేటలోని రామ్‌గోపాల్ సత్రములో అన్ని వసతులు జయప్రదముగా కల్పించడమే కాకుండా అన్ని విధాలసహాయ సహకారాలు అందించి శ్రీ కనకారావు గారు తమ శక్తి సామర్థ్యాలను చాటుకున్నారు. సభలు జయప్రదంగా ముగిసాయి.

విజయవాడలో మామిడి పండ్ల ఎగుమతులు రైల్వే ద్వారా జరపడానికి కమీషన్‌ఏజంటుగా ఉంటూ తమ సంపాదనలో ఏకొద్దిగానో కుటుంబ అవసరాలకు ఉంచుకుంటూ మిగతా యావత్తు సొమ్మును కళాప్రదర్శనకు, కళాకారుల సన్మానాలకు. రాజకీయ సమావేశాలకు, సభలకు వెచ్చిస్తూ ప్రస్తుతం ఉంటున్న చిన్న ఇల్లు తప్ప మరేమీ మిగుల్చుకోలేక పోయారు శ్రీ కనకారావు గారు. ఆస్తిపాస్తులంటూ చెప్పుకోదగ్గవి ఆయన గత స్మృతులు, సుదీర్ఘ అనుభవాలు.. మిత్రుల స్నేహ వాత్సల్యాలు,. సహృదయముతో పదిమందిలో గౌరవప్రతిష్టలు. కనకారావు దగ్గరకు వెళ్ళు నీ అవసరం కొంతయినా తీరుతుంది అని నలుగురు చెప్పుకోనే మంచి మాటలు, ఆయాసందర్భాలలో గుర్తుకు వస్తున్న కొన్ని మంచి సంఘటనలు.

అవి శ్రీ కనకారావు విజయవాడలోవించిపేట లో వుండే రోజులు. 1945-46 సంవత్సరాలు "ఆశాజ్యోతి, తెలుగుతల్లి" నాటక ప్రదర్శనలిస్తూ ఆంధ్రప్రదేశ్ పర్యటన చేస్తూ ఉండేవారు శ్రీదుక్కిపాటి మధుసూధన రావు, అక్కినేని నాగేశ్వరరావు ,పెండ్యాల నాగేశ్వరరావు, కె. ప్రభాకరరావు, కోడూరి అచ్చయ్య చౌదరి, ఆయన ట్రూపులో సహకారులు. విజయవాడ నగరానికి రాగానే వీరందరూ కనకారావుతో కలిసి తిరిగేవారు. విశ్రాంతి వసతి ఏర్పాట్లు శ్రీకనకారావు చేసే వారు. అప్పట్లో విజయవాడ పట్టణంలో యిన్ని నాటకసంఘాలు లేవు. ఫిలిం పంపిణీ సంస్థలు లేవు. కళారంగంలో మిత్ర వాత్సల్యాన్ని పుణికి పుచ్చుకున్న విజయవాడపౌరుడు శ్రీ కనకారావు. ఆ కారణంగా దుక్కిపాటి వారికి, అక్కినేని వారికి శ్రీ కనకారావు స్నేహం అవసరమయింది.

"పల్లెపడుచు, ఆడది, కులం లేని పిల్ల, అన్నా చెల్లెలు" ప్రదర్శనల సందర్భముగా సర్వశ్రీ పినిసెట్టి శ్రీరామమూర్తి అల్లురామలింగయ్య, చలం మొదలైన నటులు, రచయిత పినిసెట్టితో పాటు శ్రీ కనకారావు ఆతిధ్యాన్ని స్నేహ మాధుర్యాన్ని కోరేవారు. ఆసందర్భంగానే శ్రీ కనకారావు ఆధ్వర్యములో విజయవాడలో కేదారేశ్వరపేటలో 61/2 ఎకరాల స్థలం లో విజయవాడ ఫ్రూట్స్ మర్చెంట్స్ అండ్ కమీషన్ మర్చంట్స్ అసోసియేషన్, రూపురేఖలు దిద్దుకున్న మామిడిపండ్ల మార్కెట్టు శంకుస్థాపన 14.6.1969 న జరిగింది. కేంద్ర మంత్రి డా. కె.యల్. రావు శంకుస్థాపన జరపగా కేంద్ర రైల్వే శాఖా మంత్రి శ్రీ రాం సుభాగ్‌సింగ్ ఆధ్వర్యం వహించారు. మొదట్లో మామిడి పండ్ల మార్కెట్ పాకల్లో నిర్వహించబడేది. 30.1.1977 భవన నిర్మాణం పూర్తి అవడంతో ఇనాగ్యురేషన్ అప్పటి రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గారిచే చేయించారు. శ్రీ సుంకర ఆనాటికి ఈ మార్కెట్ కమిటీ కార్యదర్శిపదవి నుండి గౌరవాధ్యక్ష పదవికి ఎదిగారు ఈనాటికీ విజయవాడలోని ఈ మామిడిపండ్లమార్కెట్టు రాష్ట్రంలో ప్రధమ స్థాయిలో వెలిగి పోతున్నది.

1971 లొ దక్షిణ మధ్య రైల్వే జోనల్ కన్సల్ టేటివ్‌కమిటి నుండి. అఖిల భారత రైల్వే సలహా సంఘ సభ్యులుగా శ్రీ కనకారావు ఏకగ్రీవంగా ఎన్నికైనారు. ఈ సభ సందర్భంగా ఆనాటి హోంశాఖా మంత్రి శ్రీ జలగం వెంగళరావు ముఖ్యఅతిధిగా శ్రీ కనకారావును సన్మానించారు విజయవాడ పౌరులు,ఆనాటి చాంబర్ ఆఫ్ కామర్స్, శ్రీ పచ్చిపులుసు సుబ్బారావు అధ్యక్షత వహించారు.

1975 లో ఆంధ్రప్రదేశ్ నాటకోత్సవాలు జరిగాయి. విజయవాడలో మునిసిపల్ స్పెషల్ ఆఫీసర్ శ్రీ.జి.పి. రావు ఉత్సవాల ఆధ్వర్యం వహించారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని విజయవాడ స్టేడియం ఉపయోగించుకునేందుకై రు. 5 వేల విలువ చేసే ముఖ్‌మల్ తెరను మునిసిపాలిటీకి బహూకరించారు మన కనకారావు.

1977-78 లో రాష్ట్రఖాదీ మరియుగ్రామీణ పరిశ్రమబోర్డు సభ్యులుగా శ్రీ కనకారావు ను ప్రభుత్వం నియమించింది. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని శ్రీ కనకారావు 55 వ జన్మదినోత్సవాన్ని ఘనంగా జరిపారు విజయవాడ పట్టణ పౌరులు . హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఆవుల సాంబశివరావు అధ్యక్షత వహించారు సన్మానసభకు. రైల్వేజంక్షనుగా పేరు పొందిన విజయవాడను, లలిత కళల జంక్షనుగా రెండు కళా పీఠాలను స్థాపించి ప్రసిద్ధితెచ్చిన శ్రీ కనకారావును సన్మానించడానికి ఏర్పాటయిన సభకు రావడం తాము ప్రధానకార్యక్రమంగా భావిస్తున్నారని ఎన్ని ముఖ్యకార్యక్రమాలు ఉన్నా వాటిని సర్దుబాటు చేసుకొని రాగలిగినందుకు సంతోషిస్తున్నానని అన్నారు చీఫ్ జస్టిస్ సాంబశివరావు.

నలభైఏళ్ళ రాజకీయ జీవితం లో శ్రీ కనకారావు తమతో చెలిమిగా ఉంటున్నారని ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆనాటి వైస్-చాన్సలర్ (ఉపాధ్యక్షులు) శ్రీ యం.ఆర్. అప్పారావు చెప్పారు. "కావ్యేషు నాటకం రమ్యం, నాటకాంతం సాహిత్యం" అని పెద్దలు చెపుతారు. ఆనాటి నాటకాల ప్రదర్శనకోసం సమాజాలను నెలకొల్పి ప్రదర్శనల భారాన్ని మూపున మోస్తూ పలుసంఘాల కార్యదర్శిగా నిరంతరం కళామతల్లి సేవలలో నిమగ్నుడై కళలకోసం యిన్ని సంవత్సరాలు జీవితాన్ని అంకితం చేసిన శ్రీ కనకారావు ను సమ్మానించడం తమకు సంతోషం అనే మాట అటుంచి మహోత్తరమైన సత్కార్యం అని శ్రీ యమ్.ఆర్. అన్నారు.

"కళా ప్రపూర్ణ " శ్రీ సి. నారాయణ రెడ్డి శ్రీ కనకారావు జన్మదిన సంచికను ఆవిష్కరిస్తూ పదవులు సంపాదించి గద్దెనెక్కిన వాణ్ణి గౌరవించడం సన్మానించడం మనకు అలవాటు . గద్దె మోసే సామాన్యుడ్ని గౌరవించడం యిప్పుడు ఇక్కడ జరుగుతున్న విచిత్రం. ఇలా ఎక్కడా జరుగదు. ఒక సంఘసేవకునికి సంస్కృతీ విభాగానికి దోహదం చేయడమే ధ్యేయంగా కళా సేవకు నిబద్ధుడైన అతి సామాన్యవ్యక్తికి పెద్దల మధ్య పీటవేసి గౌరవిస్తున్న సహృదయులైన ఈ ఆహ్వాన సంఘానికి నా కృతజ్ఞతలు. నమస్సులు, అని హర్షం వెల్లబుచ్చారు. శ్రీ యమ్.ఆర్.అప్పారావు దుశ్శాలువను , చందన తాంబూలాలతో శ్రీ కనకారావును సన్మానించారు.డాక్టర్. ఎస్. సత్యన్నారాయణ ప్రముఖ సందేశాలను వినిపించారు. వ్యాసవిద్యా విశారదశ్రీ తుర్లపాటి కుటుంబరావు సభాకార్యక్రమాల వాఖ్యానం బాగా రక్తి కట్టింది. సభానంతరం శ్రీ జొన్నవిత్తుల సుబ్బారావు బృందం హిందుస్థానీ సంగీత కచేరీ జరిగింది.

1981 లో రాష్ట్రముఖ్యమంత్రి పీఠం శ్రీ టంగుటూరి అంజయ్య అధిష్ఠించారు. కళాభిమాని కావడంతో అకాడమీలను నెలకొల్పారాయన సాంస్కృతిక కార్యక్రమాలు విజయ దుందుభి మ్రోగించాయి విశాలాంధ్రప్రదేశ్ నాటక అకాడమీ కళాభారతి శ్రీమతి జమున అధ్యక్షతన శ్రీ కనకారావు ఉపాధ్యక్షులుగా శ్రీ.బి . కృష్ణంరాజు కార్యదర్శిగా శ్రీ ఎ.ఆర్.కృష్ణ సలహాదారుగా నియామకాలు జరిగాయి. సహజంగా కళాకారుల పక్షాననిలిచే మన కనకారావు నిరుపేదలై పూటగడువని వృద్ధకళాకారులకు పింఛను సౌకర్యం కల్పించారు. అకాడమీద్వారా రాష్ట్రం నలుమూలల 450 నాటకాల ప్రదర్శనలు నిర్వహించి మూలపడిన నాటక సమాజాలకు తిరిగి ఊపిరి పోశారు శ్రీ కనకారావు. ప్రముఖ రంగస్థల నటీనటుల జయంతి ఉత్సవాలు జరిపి యువకళాకరులకు స్ఫూర్తినివ్వడానికై రాష్ట్రంలో పలు పట్టణాలలో నాటకోత్సవాలు జరిపించారు. గతాన్ని స్మరణకు తేవడానికై మరుగుపడి కాలగర్భంలో కలిసిపోయిన కళాకారుల చరిత్ర యువజనుల దృష్టికి తెచ్చి వారినిగూడా ఆదర్శవంతులుగా తీర్చి దిద్దాలనే తపనలో ఈ ఉత్సవాలు తమ భాగం పంచుకున్నాయి.

1982 వ సంవత్సరం అక్టోబరు 16న హైదరాబాద్ రవీంద్రభారతిలో శ్రీ సుంకర కనకారావు షష్ఠిపూర్తి మహోత్సవం ఎంతో గొప్పగా జరిగింది. రాష్ట్ర ఆర్థిక సాంస్కృతిక శాఖా మాత్యులు శ్రీ కోన ప్రభాకరరావు అధ్యక్షత వహించారు. ఆర్థికంగా బలపడకపోయినా అరవై ఏళ్ళ సాంఘిక. రాజకీయ, కళా రంగసేవల్లో మహత్తర అనుభవాలను ప్రోదిచేసుకొని మిగుల్చుకున్నారు శ్రీ కనకారావు. ఆంధ్ర ప్రదేశ్ నాటక అకాడమి సంయుక్త కార్యదర్శి శ్రీమతి కుసుమా రామారావు ప్రార్ధనా గీతంతో జన్మదినోత్సవానికి శ్రీకారం చుట్టారు. తమ చిన్న తనం రోజుల్లో దుగ్గిరాల వచ్చిన కనకారావు బృందం "వేనరాజు" నాటిక ప్రదర్శించారని చిన్నపిల్లగానే అలాంటి మంచి ప్రదర్శన చూసే భాగ్యం తమకు కలిగిందనిఎంతో ప్రభావితులమయ్యామని "కళాభారతి " శ్రీమతి జమున అన్నారు. శ్రీ కనకారావుదంపతులకు తమ శుభాకాంక్షలు అందజేశారు. సంస్థా వ్యవహార దక్షుడైన శ్రీ సుంకర కనకారావు కళా సేవలో అందెవేసిన చేయి అని యువకళాకారులు ఆయననుంచి నేర్చుకొదగినది ఎంతో ఉన్నదనీఅధ్యక్షులు శ్రీ కోన ప్రశంసించారు.రాష్ట్రవ్యవహారాల మంత్రి శ్రీ కొణిజేటి రోశయ్య శ్రీ కనకారావు పట్టుదల, కార్యదీక్షలను ఎంతగనో మెచ్చుకున్నారు. రాజకీయాలలోతమకు గురువులాంటి

వారని అభినందించారు.రాష్ట్ర పంచాయతీ రాజ్ శాఖా మాత్యులు శ్రీ దామోదరం మునుస్వామి మాట్లాడుతూ కృషి వల్ల గొప్పదనం సంపాదించిన శ్రీ కనకారావును అందరూ మెచ్చుకొదగిన వ్యక్తి అని చెప్పారు.రాష్ట్ర ఎక్సయిజ్ మంత్రి శ్రీ ఇందుకూరి కృష్ణంరాజు ప్రసంగిస్తూనాటక,రాజకీయ,వాణిజ్య, లలితకళా రంగాల్లో నిష్ణాతుడైన కనకారావుతోతమకు 30 సంవత్సరాల పరిచయం ఉన్నట్లు వివిధరంగాలలో ఆయన సేవలను ప్రస్తుతించారు.

ఆంధ్రప్రదేశ సంగీత నాటక అకాడమీ మాజీ అధ్యక్షులు శ్రీకూర్మా వేణుగోపాల స్వామి నాయుడు శ్రీ కనకారావుతో తమకు గల అనుబంధం వివరిస్తూ ఆయనవ్యక్తిత్వాన్ని కొనియాడారు.

ఆనాటి కార్యక్రమాలలో చిరకాల మిత్రులు సర్వశ్రీ చదలవాడ పిచ్చయ్య, ఎ.జి.ఎం.సొమయాజులు, జి.రత్నారావులు దుశ్శాలువలు కప్పి ఉచితంగా సన్మానించారు. శ్రీ కనకారావును "జ్యోతిచిత్ర" సంపాదకులు శ్రీ తుర్లపాటి కుటుంబరావు. ఆంధ్రప్రదేశ్ థియేటర్ఇన్‌స్టిట్యూట్ అండ్ రిపర్టినరీ అధ్యక్షులు శ్రీ ఎ.ఆర్. కృష్ణ మాట్లాడుతూ శ్రీ కనకారావు ఏటికి ఎదురీదే స్వభావంకలవారు గనకనే రాజకీయ కళా రంగాలో మనలుతూ తమ స్వప్రయోజనం ఏమాత్రం కాంక్షించకుండా కేవలం ఆదర్శంకోసం నిలిచిన కృషీ విలువలనీ, ఆయన 60వ జన్మదినోత్సవం చేసుకొంటున్నందుకు ఎంతోఆనందంగా ఉన్నదంటూ తమ హృదయపూర్వక శుభాకాంక్షలుఅందించారు. ప్రముఖ చలనచిత్ర సంగీత దర్శకులు శ్రీ సాలూరి రాజేశ్వరరావు శ్రీ కనకారావుకు నూతన వస్త్రాలు బహూకరిస్తూతమ సొదరసమానులనివాత్సల్యపూరిత ఆశీర్వాదం అందించారు. సూరిబాబు ట్రూపులో తాను శ్రీకృష్ణుడుగా 'కృష్ణలీలల్లో వేషం వేస్తున్న రోజులలొ తమతోపాటు శ్రీ కనకారావు 2వ కృష్ణుడు వేస్తే ఆంధ్రదేశమంతటా దిగ్విజయంగా ప్రదర్శనలిచ్చామని చెప్పారు.

ఆహ్వాన సంఘం తరుపున రాష్ట్ర ఆర్థిక సాంస్కృతిక వ్యవహారాల మంత్రి శ్రీ కోన ప్రభాకరరావు ఆంధ్రప్రదేశ్ ఫిలిం టాలెంట్స్‌గిల్డ్ తరుపున రాష్ట్ర మంత్రి శ్రీ కొణిజేటి రొశయ్య ద్వారా స్వాగత సన్మాన పత్రాలు శ్రీ కనకారావునకు సమర్పించారు. శ్రీ ప్రయాగ నరసింహ శాస్త్రి కూర్చిన పద్య రత్నాలను శ్రీ సాలూరి రాజేశ్వరరావు సభాముఖంగా నివేదించారు.

శ్రీ కనకారావు షష్ట్యబ్ది మహోత్సవం జరిపే భాగ్యం కలిగి నందుకు సంతోషం ప్రకటిస్తూ ఉత్తమ కళా సేవకుని కళాబంధువులను. సన్మానించే అదృష్టాన్ని మహాభాగ్యంగా భావిస్తున్నా మన్నారు.ఆంధ్రప్రదేశ్ నాటక అకాడమి కార్యదర్శి శ్రీ .బి. కృష్ణంరాజు.

సభానంతరము శ్రీ షణ్ముఖి ఆంజనేయ రాజు కృష్ణునిగా ఆచంట రెంకటరత్నం నాయుడు దుర్యోధనునిగా ,బి.వి, రంగారావు అర్జుననిగా శ్రీకృష్ణరాయభారంలో కొన్ని దృశ్యాలను ప్రదర్శించారు. ఆయా పాత్రల్లో వారు నటించారనడంకన్న జీవించారనడం సమంజసం.

శ్రీ కనకారావు తమ సన్మానం, సత్కారాలకు ఉచితరీతిలో కృతజ్ఞతలు చెప్పుతూ ప్రముఖ సంగీతదర్శకులు శ్రీ రాజేశ్వరరావు తనను అభినందించినందుకు మహదానందం వెళ్ళబుచ్చారు. శ్రీ యుతులు అయ్యదేవర కాళేశ్వరరావు సర్దార్ మరుపళ్ళ చిట్టి, డాక్టర్ పట్టాభిలాంటి పెద్దల ఆశీర్వాదబలమే తమరాజకీయ జీవితానికి, కళారంగంలో సాధించిన విజయాలకు కారణభూతాలని విశదీకరించారు. విజయవాడలో జన్మనెత్తినందువల్లనే శ్రీ కనకదుర్గ అమ్మవారి ఆశీర్వాదములు లభించాయని ఆదేవి ప్రసాదించిన బలం వల్లనే ఒక కళాకారుడుగా జీవిస్తూ కళాకారులను విశిష్ట విద్వాంసులను ఘనంగా సత్కరించేభాగ్యం తనకు దక్కిందని హర్షపులకిత గాత్రంతో శ్రీకనకారావు వ్యక్తీకరించారు.

నాటక కళలకు ఆరాధకులు శ్రీ సుంకర కనకారావుకు 60 ఏళ్ళు నిండిన సందర్భముగా ఆంధ్రప్రదేశ్‌లోని పలుపట్టణాలలో కళా సంస్థలు సన్మానాలు సత్కారపురస్కారాలు చేసాయి.

1983 అక్టోబరు 13న విజయవాడ రోటరీ ఆడిటోరియంలో శ్రీ సుంకర కనకారావుకు షష్టిపూర్తి మహోత్సవాలు శ్రీ. జి. యస్. రాజు. ఆధ్వర్యములో ఘనంగా జరిగాయి. ఆంధ్రప్రదేశ్ నాటక అకాడమీ అధ్యక్షులు శ్రీ.బి. కృష్ణం రాజు సమక్షములో శ్రీ బయన భీమయ్య శ్రీ కనకారావును సన్మానించారు. ప్రముఖ వాణిజ్యవేత్త శ్రీ మాజేటి ప్రహ్లాదరావు అభినందన సంచికను ఆవిష్కరించారు. ప్రొఫెసర్ పి.వి.యస్. కృష్ణశాస్త్రి ప్రముఖుల సందేశాలను వినిపించారు. సర్వశ్రీ .జంధ్యాల శంకర్ "నాటకకళా ప్రపూర్ణ" ధూళిపాళ సీతారామ శాస్త్రి "వ్యాసవిద్యా విశారద" శ్రీ తుర్లనాటి కుటుంబరావు శ్రీ రెంటాల గోపాలకృష్ణయ్య ప్రభృతులు శ్రీకనకారావును ప్రశంసిస్తూ అభినందించారు. అభిమానులు పలువురు శ్రీ కనకారావు దంపతులను పూలమాలల్తో ముంచెత్తారు.

1980 లో న్యూడిల్లీలో శ్రీమతి ఇందిరాగాంధి అధ్యక్షతన జరిగిన కాంగ్రేస్ మహా సభల్లో ప్రత్యేక ఆహ్వానితులుగా పాల్గొన్నారు మన శ్రీ సుంకర కనకారావుగారు.

## బిరుదులు పట్టాలు

1980లో ఆంధ్ర నాటక కళాపరిషత్ విశాఖపట్నంలో సమావేశమై శ్రీ సుంకరకనకారావుకు "కళొద్ధారక" బిరుదు ప్రధానం చేసింది.

1982లో హైదరాబాదులోని త్యాగరాజ గాన సభవారు శ్రీసుంకర ను సన్మానించి "కళాతపస్వి" బిరుదును అందజేశారు.

1983లో ఆంధ్రప్రదేశ్ నాటక అకాడమీ హైదరాబాదులో సమావేశమై గొప్ప సభను జరిపి శ్రీ సుంకర కనకారావుకు "కళా ప్రవీణ" అనిబిరుదు నిచ్చి గౌరవించింది.

ఇన్నిబిరుదులు పొందిన మన కనకారావుగారు పొంగిపోలేదు. గర్విష్ఠిగానే మారలేదు. మరింతబాధ్యత నెత్తిన పడినట్లు అనుకున్నారు తప్ప క్రొవ్వొత్తిలా, కర్పూరంలా కరిగిపోతూ కూడా పరిమళాన్ని సుగంధాన్ని అందిస్తున్నారు. ఈనాటికీ సహకరించే అర్థాంగి, ముత్యాల్లాంటి బిడ్డలు మామగారి మంచితనాన్ని అర్థంచేసుకొనే అల్లుడు, ఉండటానికి 50 గజాల స్థలంలో ఉన్న చిన్న డాబా శ్రీసుంకరకు మిగిలిన స్థిరాస్తులు.

రాష్ట్రరాజకీయాల్లో మార్పులు రావడం అకాడమీలు రద్దు కావడంతో కళోద్ధరణకు ఎన్నోరకాలుగా ప్రభుత్వాన్ని సమీకరిద్దామని భావించిన శ్రీ సుంకర ఆశలు అడియాశలైనాయి. స్వాతంత్ర్య పోరాటంలోనూ నాటక సేవలలోనూ సైనికునిగానే స్థిరసంకల్పముతో అహరహంకృషి చేసిన చేస్తున్న శ్రీ సుంకర కనకారావు అవిశ్రాంత యోధుడు. ఈ సందర్భముగా శ్రీ రెంటాల గోపాల కృష్ణఅన్న ఈమాటలు చిరస్మరణీయాలు. శ్రీ కనకారావులో తానెరగని హనుమంతుడు. కుడుము చేతికిస్తే పండగనుకొనే అమాయకుడు. ఆ కుడుములో అమృతం కలిసిందో విషంనింపుకున్నదో పరిశీలించడు. పసిపిల్ల వానిగా సంభరంగా నోట్లో పెట్టుకుంటాడు. అమృతం అయినా హాలాహలమైనా అందర్నీ నమ్మడం ఈ నాటికీ మాననివాడు. మొహం చిట్లించడు. మామూలుగానే తన సేవా కార్యక్రమాలు కొనసాగిస్తూ ఉంటాడు. నిండుకుండే అయినా నమ్మిచెడిన వాడు డా. సినారే అంటారు. నొప్పించక తానొవ్వక వీలయినంతవరకు మెప్పించుకుని తిరిగే శ్రీ కనకారావు నవ్వులు చురుకు చేతలో అవిష్కరించే కళాహృదయం".

ఇక నవ్యకవి నాదెళ్ళ పురుషోత్తమ శాస్త్రి షష్ట్యబ్ద ఉత్సవాల సందర్భముగా శ్రీ కనకారావును అభినందిస్తూ ఈ కనకారావుకు ఆయుష్షష్టి అంటే కొట్టవచ్చు నిష్ఠి కాని సమిష్టిగా యోచిస్తె ఆయన కున్నది కళాదృష్టి. అదే ఆయనకున్న సంతుష్టి. ఆయన మస్తిష్కంలో వార్ధక్యానికి తావు లేదు. అందుకే జుట్టు నెరవడంగూడా మరిచింది.

చిరునవ్వులు చిలుకు కనకారావు కులుకు
జన్మలో అచ్చిన తళుకు అదేఅతగాడి బెళుకు
అందుకే ఆకనకారావు నవ్వితే నాకెంతోముద్దు
నా ఆదరింపు ఎల్లలకు ఉండదిక హద్దు. అని

శ్రీ సి.నా.రె మరొక సందర్భములో శ్రీ కనకారావుగురించి యిలా అన్నారు. సహజంగా పెదవుల మీదటి చిరునవ్వు తరువాత గొంతు పలుకుతుంది. హృదయంతోనే అందరినీ ఆలింగనం చేసుకుంటాడు. అందుకే ఆయన చిరునవ్వులు నేను ప్రేమిస్తాను.

కరుణ శ్రీజంధ్యాల పాపయ్య శాస్త్రి గారు షష్ఠిపూర్తి సందర్భముగా శ్రీ కనకారావును అభినందిస్తూ "కదంతొక్కు తున్న అభ్యుదయం ఆయన" అని పేర్కొన్నారు.

"అరవై ఏండ్లు దాటుతున్న
ఇరవైదాటుతున్నట్లుంటాడు
సురుచిర సొగసు ప్రోవు
సుంకర కనకారావు పేరులో
వున్నది "సువర్ణం ' ఇంటి
పేరులో ఉన్నది సు వర్ణం
అందుకే పలికే పలుకులు బంగారం
మనిషి మనిషి అంతా శింగారం
అధరంపై చిరునవ్వులు అరవిచ్చిన
విరజాజులు చురకలు వేసే హృదయం
కదంత్రొక్కు అభ్యుదయం.

రచయితలు సినిమా దర్శకులు, స్వాతంత్ర్యసమరయోధులు డాక్టర్ ఇంటూరి వెంకటేశ్వర రావు అంటారు కదా " కనకారావు ఒక వ్యక్తి మాత్రమే కాదు ఒకసంస్థ. నిజయమైన కర్మయోగి.స్వచ్ఛమైన హీరో. హీరో ఎప్పుడూ గులాబీ శయనమునందే శయనించడు. లోన హృదయాన్ని తానే భక్షిస్తుంటాడు. అనే ఆంగ్లకవి ప్రవచనానికి శ్రీ కనకారావు సరైన అతికిపోయినట్లున్న ప్రతీక అంటారు. శ్రీ పినిసెట్టి శ్రీరామమూర్తి- శ్రీ కనకారావును గౌరవించడం అంటే మంచికి మనుగడ కల్పించడం. మానవతకు గుర్తింపునివ్వడం అని.

మాజీ పార్లమెంటుసభ్యులు ఒక నాటి ప్రదేశ జనతాపార్టీ కార్యదర్శి శ్రీ సందా నారాయణప్పకనకారావును అభినందిస్తూ 1978 లో యిలా అన్నారు "విశాలహృదయుడు, ఉదారస్వభావుడు, మచ్చలేని మనిషి. పెద్దలఎడ గౌరవం, పిన్నలందు వాత్సల్యం అరమరికలు లేకుండా ప్రదర్శించే వ్యక్తి".

డాక్టర్ మంగళంపల్లి బాలమురళీకృష్ణశ్రీ కనకారావు విషయం ప్రస్తావిస్తూ 'శ్రీకనకారావు పొందవలసిన పదవులు పొందనేలేదు అని చెప్పాలి. దీని వల్ల లోపం వారికిలేదు. దేశానికి, ముఖ్యంగా రాష్ట్రం నోచుకోలేదు. రాజకీయంలో ఉండవలసిన కొన్ని లోపాలు వారివద్ద లేనందుకే వారు రాజకీయాలలో ముఖ్యపాత్ర నిర్వహించే అవకాశం రాలేదు. అందువల్ల ఆయన ప్రతిభకు ఏమాత్రం లోపం

లేదు. నాకు మొట్టమొదటి సన్మానం చేసినది వీరె. ఏ క్షణాన ఆయన దూరదృష్టితో సన్మానం చేసారో ఆనాటినుండి నాకులెక్కలేనన్ని సన్మానాలు జరుగుతూనే వున్నాయి.

ఆచార్య యం.జి రంగా మరో విధంగా॥శ్రీ కనకారావును గుర్తించారు. ఆయన మాటల్లో కనకారావు విజయవాడలో ముఖ్యమైన కాంగ్రెస్ కార్యకర్త. నగరంలో బహుళఆదరం పొందిన ప్రముఖుడు. సాంస్కృతిక వ్యవహారాలపట్ల సంప్రదాయబద్ధమైన దృక్పథం కలవాడు. చాలా సులభంగా స్నేహం కలుపుకుంటాడు. ఆస్నేహాన్ని కలకాలం నిలుపుకుంటాడు. కవులకు ,కళాకారులకు, సహజసిద్ధమైన స్నేహనేధి. మంచివాడు. మంచివారి సహృదయముతో అభిమానించ దగిన ఉత్తముడు.

" కళాకారులు, యౌవనోత్సాహం గల జాతీయవాది ."కళల పట్ల ఆయన సేవలు బహుధా ప్రశంసనీయం. ఆ కళా రంగం మరింత కాలం ఆయన సేవలు అందుకుని మూడు పూలు ఆరుకాయలుగా భాసించాలని నా అభిలాష" అన్నారు శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు.

గతం కొట్టివేయాల్సిందికాదు. గతం వర్తమానానికి పునాది. దాదాపు 45 సంవత్సరాల సేవలు గుర్తింపుకు రాబట్టే శ్రీ కనకారావు అనేక గౌరవ పదవులు పొందగలిగారు.

విజయవాడ పండ్ల వర్తకసంఘం గౌరవాధ్యక్షులుగా వుంటున్న శ్రీ కనకారావు మామిడికాయ ఎగుమతులు లోడింగ్ గత 5 ఏళ్ళుగా జరగనందున 1984 మార్చిలో వ్యాపారస్తుల కోరిక మీద ఢిల్లీ వెళ్ళి, డాక్టర్ కె.ఎల్.రావు గారి సహకారంతో రైల్వే మంత్రి రైల్వే బోర్డు చైర్మన్ "రాఘవ" గార్లను కలిసి ఫ్రైట్ ఫార్వరడింగ్ స్కీమ్ అనే క్రొత్త పద్ధతి క్రింద, వి.పి.ల ద్వారా రైల్వే స్టేషన్లలో మామిడికాయల ఎగుమతికి ఆర్డరు సంపాదించారు. దీనితో లోడింగ్ ఎగుమతుల రవాణా చాలా సులభ సాధ్యమయింది.

## తిరిగి బ్రతికిన మృత్యుంజయుడు

1985లో రైలు ప్రయాణంలోనే హృద్రోగానికి గురియై, అపస్మారక స్థితిలో నున్న శ్రీ కనకారావును "ఖమ్మం" స్టేషన్‌లో గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో గుర్తించి అక్కడి డా॥ సుధీర్ నాయక్ గారి పర్యవేక్షణలో మద్రాసులోని 'అపోలో' ఆస్పత్రికి తరలించారు. డా॥గిరినాథ్ గారి పర్యవేక్షణలో 1985 మే నెల 25న బైపాస్ సర్జరీ జరిగింది. 15 రోజుల అనంతరం సంపూర్ణ ఆరోగ్యవంతులుగా విజయవాడ తిరిగి వచ్చారు శ్రీ కనకారావు మృత్యుంజయులై. అదే '85 సెప్టెంబర్ 10వ తేదీన శ్రీ కనకారావు 3వ కుమారుని వివాహం కృష్ణాజిల్లారైస్‌మిల్లర్స్ ఎసోసియేషన్ హాల్లో అతి ఘనంగా జరిగింది. ఎందరో అతిరథ మహారథులు వివాహానికి విచ్చేసి చి॥ దుర్గాప్రసాద్, సుజాతలను ఆశీర్వదించారు.

1986లో రైల్వేమంత్రి శ్రీ మాధవరావు సింధియా శ్రీ కనకారావును జోనల్‌రైల్వేయూజర్స్ కన్సల్‌టేటివ్ కమిటీ మెంబరుగా నియమించారు. రైల్వేలకు, ప్రయాణీకులకు, రవాణాదారులకు 25 సంవత్సరాలుగా శ్రీ కనకారావు సేవలను రైల్వేమంత్రి గుర్తించి గౌరవించిన సందర్భంగా సిటీ కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ జి.ఎస్. రాజు అధ్యక్షతన కాంగ్రెస్ ఆఫీస్ "ఆంధ్రరత్న భవన్"లో గొప్ప సన్మానసభ జరిగింది. ఏ.జి.ఆర్.ఎమ్. శ్రీ ఎల్.ఎన్. రావు ప్రారంభకులుగా జరిగిన సభలో కార్పొరేటర్లు, పట్టణ ప్రముఖులు శ్రీ కనకారావును ఘనంగా సన్మానించారు. అభినందించారు.

మామిడికాయల మార్కెట్ నిర్మాణానికి, 15 సంవత్సరాలుగా పండ్ల వర్తకసంఘ కార్యదర్శిగా వుంటూ ప్రత్యేక మార్కెట్ నిర్మాణం చేయించి తద్వారా అందించిన సేవలకు గుర్తింపుగా, 1987లో కేదారేశ్వరపేటలోని మామిడికాయల మార్కెట్ కార్యాలయంలో ఘనసన్మానం పొందారు శ్రీ కనకారావు.

ఆ సంవత్సరంలోనే రాజమండ్రి ఆలిండియా గ్రాఫైట్ క్రూసిబుల్ మాన్యుఫాక్చరర్స్ అసోసియేషన్ వారికి వ్యాగన్‌లోడింగ్ సదుపాయాలు సక్రమపద్ధతిలో కల్పించేందుకు ఢిల్లీ వెళ్ళి శ్రీ జలగం వెంగళరావు సహకారంతో రైల్వేమంత్రి ద్వారా బుకింగ్ ఆర్డర్ సంపాదించారు శ్రీ కనకారావు. తత్ఫలితంగా ఆ అసోసియేషన్‌వారు రాజమండ్రిలో రైల్వే డి.ఆర్.ఎం. శ్రీ రాజారాం అధ్యక్షత శ్రీ కనకారావును గొప్పగా సన్మానించారు.

1986లో తిరిగి విజయవాడ నగర కాంగ్రెస్ ఉపాధ్యక్షులుగా శ్రీ కనకారావుగారిని, ప్రదేశ్‌కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ జలగం వెంగళరావు నియమించారు. నగర కాంగ్రెస్ అధ్యక్షులుగా శ్రీ జి.ఎస్. రాజు. ఈ 86 లోనే భారత కృషిక సమాజ్ రైతుల సమాఖ్య జాయింట్ కన్వీనర్‌గా పదవీ బాధ్యతలు స్వీకరించారు శ్రీ కనకారావు. ఈ నియామకాన్ని మాజీ హోం మంత్రి శ్రీ కె. ప్రభాకరరావు చేశారు.

1987, మార్చి నెలలో విజయవాడ మునిసిపల్ ఎన్నికలు జరిగాయి.శ్రీ కనకారావు కృషి పండి, 15 సంవత్సరాల అనంతరం మునిసిపల్ కార్పొరేషన్ తిరిగి కాంగ్రెస్‌వారి చేతుల్లోకి వచ్చింది. ఈ కీర్తి శ్రీ కనకారావుకు చెందవలసి వుంది.

ఈ 86లోనే కేంద్ర సమాచార శాఖా మాత్యులు శ్రీ.వి.యన్. గాడ్గిల్‌ను ఢిల్లీలో కలసి విజయవాడలో దూరదర్శన్ కేంద్రం నెలకొల్పాల్సిన ఆవశ్యకత వివరించి నచ్చచెప్పేరు శ్రీ కనకారావు. తిరిగి 1987లో కేంద్ర ప్రసారశాఖా మాత్యులు శ్రీ అజిత్ పాంజాను

కలిసి దూరదర్శన్ కేంద్ర నిర్మాణం విజయవాడలో జరిగేందుకు గాను అనుమతి, ఆర్డరు సంపాదించారు. స్థానిక వృత్తి కళాకారులకు, ఔత్సాహిక నటులకు మంచి అవకాశాలు లభిస్తాయనే సదాశయంతో శ్రీ కనకారావు చేసిన కృషి సఫలమయింది.

1987లోనే విజయవాడ ఆకాశవాణి కేంద్ర శాస్త్రీయ సంగీత విభాగం ఆడిషన్ బోర్డు సభ్యులుగా శ్రీ కనకారావు నియామకమయ్యారు. కేంద్ర ప్రసార మంత్రిత్వశాఖ ఈ నియామకం చేసింది.

"భారత కృషి సమాజ్" 25వ జాతీయ మహాసభలు 1988 ఫిబ్రవరి 15,16 తేదీల్లో హైదరాబాద్ లాల్‌బహదూర్ స్టేడియంలో జరిగాయి. లోక్‌సభ స్పీకర్ శ్రీ బలరాం జక్కర్ అధ్యక్షత వహించారు. ప్రధాని శ్రీ రాజీవ్ గాంధీ సభలను ప్రారంభించారు. రాష్ట్ర గవర్నర్ శ్రీ కుముద్‌బెన్ జోషి, కేంద్ర పరిశ్రమల మంత్రి శ్రీ జలగం వెంగళరావు, కేంద్ర వ్యవసాయ మంత్రి శ్రీ భజన్‌లాల్, పలువురు పార్లమెంటు సభ్యులు, పార్లమెంటులో కాంగ్రెస్ పార్టీ డిప్యూటీ లీడర్ ప్రొఫెసర్ ఎన్.జి. రంగా, మహారాష్ట్ర గవర్నర్ డా॥ మర్రి చెన్నారెడ్డి హాజరైనారు. భారత కృషి సమాజ్ రైతులు సమాఖ్య జాయింట్ కన్వీనర్‌గా శ్రీ సుంకర కనకారావు ఈ సభలో పాల్గొన్నారు.

1990లో అఖిల భారత తెలుగు మహాసభలు బెంగుళూరులో జరిగాయి. డాక్టర్ శంకర్ దయాళ్‌శర్మ అధ్యక్షత వహించారు. శ్రీ కనకారావు నాటక కళ, శ్రీ నటరాజ రామకృష్ణ నాట్య కళ, శ్రీమంగళంపల్లి బాల మురళీకృష్ణ సంగీత కళమీద ప్రసంగాలు చేశారు.

1992 జూన్‌లో ప్రాంతీయ ఫిలిం సెన్సార్ బోర్డు సభ్యులుగా శ్రీ సుంకర కనకారావు నియామకం జరిగింది. జులై నెలలో ఆంధ్రప్రదేశ్ స్టేట్ కో-ఆపరేటివ్ కన్స్యూమర్స్ ఫెడరేషన్ లిమిటెడ్ డైరెక్టరుగా శ్రీ కనకారావును ప్రభుత్వం నియమించింది.

1974-80ల మధ్య శ్రీ కనకారావును వరించి సేవలు పొందిన అనేక సంస్థలు మరెన్నో వున్నాయి. విజయవాడ పట్టణ ఛాంబర్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీస్ నిర్మాతల్లో శ్రీ కనకారావు ఒకరు. ఈ నాటికీ ఛాంబర్ సమావేశాలకు హాజరవుతూనే వుంటారు. విజయవాడ శ్రీ దుర్గామల్లేశ్వరస్వామి దేవస్థానం ధర్మకర్తల సంఘ సభ్యునిగా, ప్రభుత్వ ఆసుపత్రి సలహామండలి సభ్యునిగా, ఆంధ్రప్రదేశ్ ఛాంబర్ ఆఫ్ కామర్స్ మండలుల సమాఖ్య సభ్యులుగా, ఆంధ్రప్రదేశ్ పండ్లు, కూరగాయలు, ఉల్లిగడ్డలు, బంగాళాదుంపల వ్యాపారుల ఫెడరేషన్ గౌరవ అధ్యక్షులుగా, విజయవాడ పండ్ల కమీషన్ వర్తకుల సంఘ గౌరవాధ్యక్షులుగా, విజయవాణి కళాసమితి అధ్యక్షులుగా, కనకదుర్గ కళాసమితి శాశ్వత సభ్యులుగా శ్రీ కనకారావు బహువిధాల సేవలు చేశారు.

శ్రీ కనకదుర్గమ్మ వెలసిన ఇంద్రకీలాద్రి పైకి శ్రమపడి భక్తులు పాదచారులై ఎక్కుతున్నందున, లేవలేనివారు, వృద్ధులు, పిల్లల సంక్షేమం ఆలోచించి, కొండపైకి వెళ్ళడానికి మినీబస్ రాకపోకలు ఏర్పాటు చేయడానికి శ్రీ కనకారావు కృషి ఎంతగా వున్నదో చాలా కొద్దిమందికి మాత్రమే తెలుసు. కనకదుర్గమ్మ గుడి ధర్మకర్తల సంఘ సభ్యులుగా కూడా శ్రీ కనకారావు కొంతకాలం వ్యవహరించారు.

1992 జులైలో ప్రాంతీయ ఫిలిం సెన్సార్‌బోర్డు సభ్యులుగా నియామకమయిన సందర్భంలో ఆయనను కలిసిన పత్రికల వారికి సెన్సార్ విషయంలో తమ దృక్పధాన్ని నిర్ద్వంద్వంగా వెల్లడించారు.

"చిత్రాలను హడావుడిగా సెన్సార్‌కు సమర్పిస్తే అంగీకరించం. బోర్డు అనుమతి పొందకముందే ప్రింట్లు వేసే లేబరేటరీలపై కఠినచర్యలు తీసుకోబడతాయి. ధనార్జనే ధ్యేయంగా అశ్లీలత, హింసాప్రవృత్తి ప్రేరక దృశ్యాలను జొప్పించిన చలన చిత్రాల నిర్మాతలపై తీవ్ర చర్యలు తీసుకోబడతాయి. అలాంటి చిత్రాలకు ఏ పరిస్థితిలోనూ సెన్సార్ సర్టిఫికెట్ ఇవ్వడం జరగదు. ఒత్తిళ్ళకు, ప్రలోభాలకూ లొంగే ప్రసక్తి లేదు నగర కూడళ్ళలో అసభ్యమైన పోస్టర్ల ప్రదర్శన సహించం. అలా పోస్టర్లు ప్రదర్శించిన వారిని సహించం. తగినవిధంగా శిక్షిస్తాం. కేంద్ర సెన్సార్ బోర్డుకు తమ దృక్పధాన్ని స్పష్టంగా తెలియజేసామని, తమ సహచర సభ్యులతో పాటు వారి సహకారం పొందగలమని స్పష్టపరిచారు శ్రీకనకారావు.

యువతకు సచ్ఛీలం అవసరమని, ఉద్రేక, ఉద్వేగపూరిత సినిమాల ద్వారా వారి మనస్సులను ఖరాబు చేయడానికి తాము అంగీకరించజాలమని, ఆరోగ్యకర, సందేశాత్మక, ప్రబోధాత్మక చిత్రాలకు తమ అండదండలు ఎప్పుడూ వుంటాయని శ్రీ కనకారావు ఉద్ఘాటించారు. శృతి మించిన శృంగారం, హింస సహించరాదని, తమ హయాంలో సకుటుంబంగా చూడగల సినిమాల ప్రదర్శనను ప్రజలు ఆశించవచ్చునని ఆయన వ్యక్తపరచారు.

## మరికొన్ని మంచి ఘడియలు

1991 లో హైదరాబాద్ దూరదర్శని వారు "50 సంవత్సరాల తెలుగు నాటకరంగం" అనే అంశం పై శ్రీ సుంకర కనకారావుతో ఇష్టాగోష్టి ప్రసారం చేశారు.

1993, జనవరి 14న నెల్లూరు "కళాసుధ" దశమ వారికోత్సవ సందర్భంగా శ్రీ సుంకర కనకారావుకు, డా. బెజవాడ గోపాలరెడ్డి చేతుల మీదుగా ఘన సన్మానం జరిగింది కుమారి కె. పద్మశ్రీ (పార్లమెంటు సభ్యురాలు) ముఖ్య అతిధిగా వ్యవహరించారు.

1994 మార్చి 8న దూరదర్శన్ మాష్టర్ ఛానల్‌లో శ్రీ సుంకరతో ఇంటర్వ్యూ ప్రసారమయింది.

1994 ఏప్రియల్ 3వ తేదీన మద్రాసు తెలుగు అకాడమీవారు శ్రీ కనకారావుకు ఉగాది పురస్కారం జరిపారు. తెలుగు నాటకరంగ సేవాధురీణతకు గుర్తింపుగా. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కర్ రెడ్డి శ్రీ కనకారావుకు గౌరవం నెరపారు. ఆ సభకు "నటసమ్రాట్" డా. అక్కినేని నాగేశ్వరరావు ముఖ్య అతిథి.

1994లో విజయవాడ రోటరీక్లబ్ ఆధ్వర్యంలో రోటరీ ఆడిటోరియంలో నాడు నేడూ నాటకరంగం 50సంవత్సరాల చరిత్ర ప్రసంగించారు.

19 ఏప్రియల్ 1994 "విశ్వసాహితి" వారు హైదరాబాద్‌లో శ్రీ కనకారావును సన్మానించారు. డా. పోతుకూచి సాంబశివరావు అధ్యక్షత వహించగా. సన్మానం ప్రఖ్యాత సినీనటులు శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావు చేతుల మీదుగా జరిగింది. ప్రముఖ న్యాయవాది శ్రీ కోకారాఘువరావు పాల్గొన్నారు.

జూన్ 28, 1994న మన ప్రియతమ ప్రధాని శ్రీ పి.వి.నరసింహారావు 74వ జన్మదినోత్సవ సందర్భంగా హైదరాబాద్ జూబిలీహాల్లో శ్రీ కనకారావుకు ఘన సన్మానం జరిగింది. రాష్ట్ర గవర్నర్ శ్రీ కృష్ణకాంత్, బెంగాల్ గవర్నర్ శ్రీ కె.వి.రఘునాథరెడ్డి, ఆర్థికమంత్రి శ్రీ కొణిజేటి రోశయ్యలు కనకారావు సేవలను ప్రశంసించారు. ప్రఖ్యాత సినీనటులు శ్రీ రమణమూర్తి సభాసారధ్యం వహించారు.

## ఉపసంహారం

మానవత మూర్తీభవించిన చిరునవ్వుల సుందరమూర్తి శ్రీకనకారావు ఈరోజు 72వ జన్మదినోత్సవం జరుపుకుంటున్నారు. "కాకి చిరకాలమున్న ఏం ప్రయోజనం?" అని కాకిగా కాక, హంసలా ఇంతకాలం ఆరోగ్యంగా, యువతకు స్ఫూర్తిగా, అందరి మన్ననలను, ఆప్యాయతను, ఆదరాన్ని, గౌరవాన్ని పొందుతూ, రాజకీయ నాటక రంగాలలో పరిణిత ప్రజ్ఞతో, అనుభవాల గుట్టగా, పండిపోయిన శ్రీ కనకారావు జీవిత చరిత్ర ఆంధ్రులకే కాదు, మరే జాతికైనా ఆదర్శవంతం కాగలదు.

ఈ సందర్భంలో భాగవతంలో పద్యము జ్ఞాపకం వస్తుంది.

బలిచక్రవర్తితో అంటారు గురువులు శుక్రాచార్యులు "విష్ణుమూర్తి వామనుడై వచ్చారు. నిన్ను మోసంతో, వంచించి అధఃపాతాళానికి త్రొక్కబోతున్నాడు" అని ఆయన 3 అడుగులు దానం యివ్వడాన్ని ఆపడానికి ప్రయత్నిస్తున్న సందర్భంలో. బలిచక్రవర్తి "కారే రాజులు రాజ్యముల్ కలుగరే, గర్వోన్నతిన్ పొందరే వారేరీ సిరి మూట గట్టుకుని పోవం జాలిరే భూమిపై పేరైనన్ గలదే శిబి ప్రముఖులు యీరే కోర్కెలు వారలన్ దలపరే యిక్కాలమూన్ భార్గవా" అంటారు. ఆదిన్ శ్రీసతి కొప్పుపై తనువుపై అంశోత్తంబుపై ....నూత్న మర్యాదం జెందుకరంబు క్రిందై, మీదైనా కరంబుంటయు మేల్గాదీ రాజ్యము గీజ్యమున సతతమే, కాయంబు నాపాయమే.

శ్రీ కనకారావు సరిగా ఇదే తత్వం గలవారు. నావల్ల సహాయం పొందేరు అనేకులు, నేను ఎవరినీ ఆశ్రయించలేదు, యాచించలేదు, మోసగించలేదు. నా చేయి పైనే కదా! ఉత్తములైతే నన్ను, నా సహాయాన్ని గుర్తుంచుకుని అభిమానిస్తారు. లేకపోతే పోయిందేమిటి.. ధనార్జనకోసమా, కృతజ్ఞతలు వారి సహాయ సహకారాలు ఆశించి నేను వారికి నా సేవలు అందించి వుంటే కదా! ప్రతిఫలాపేక్షతో సేవలకు ఉద్యుక్తుడనయినప్పుడు కదా వ్యధ చెందవలసింది? అని సూటిగా ప్రశ్నిస్తారు శ్రీ కనకారావు.

ఇంతమందికి ఇన్ని సహాయాలు చేశారు కదా మీకేమి వొరిగింది, చాలా మంది కృతజ్ఞతలు కూడా వెలిబుచ్చలేదే అన్న ప్రశ్నకు శ్రీ సుంకర కనకారావు యిలా అన్నారు. 'పరోపకారం ఒక ధ్యేయంగా పూనుకుని చేయడం వల్లనేమో భగవంతుడు ఈ రోజుకు కూడూ, గుడ్డ, నివాసానికి ఇల్లు యిచ్చారు కదా, మరేం కావాలి. నేనేం ఆశపోతును కాదు. ప్రాప్తించినదానితో సంతోషించాలి. ఈ రోజుకు నేను దేవుడ్ని ఒకటే ప్రార్థిస్తాను. నాకు యిచ్చినవేవీ తిరిగి లాక్కోవద్దు. పదిమందికీ నేను ఉపయోగపడేలా దీవించు అని'.

"కోట్లకు పరుగెత్తుదాం అనే దురాశతో పరుగుపందెం లాంటి జీవన గమనంలో పరుల పంచలో మాత్రం నన్ను బ్రతకనీకు. ఇదే నాప్రార్థన. మరొకటి కోరను" అని.

70 ఏళ్ళ యువకుడయిన శ్రీ సుంకర కనకారావు ఆరోగ్యంగా, ఆనందంగా, కళారాధకుడిగా నూరేళ్ళు బ్రతికి బట్టకట్టి మరింత స్నేహదీపాన్ని వెలిగిస్తూనే వుండమని కోరడం కన్నా మిత్రులు మరేమి ఆశిస్తారు?

భగవానుడు ఈ సచ్చీలుని సదా రక్షించుగాక అని నా బోంట్లు కోరడంకన్నా చేయగలిగిన మరో మంచిపని అంటూ లేదు. అన్న.

"సర్వేజనాః సుఖినోభవంతు"

శ్రీ కనకారావు సదా జీవించు

## ప్రముఖుల మాటల్లో సుంకర

* సంకుచిత తత్వాలకు అతీతుడు, నిస్వార్థ సేవా పరాయణుడు, గొప్ప నటుడు, నాయకుడు, సుంకర వారు యిలా కలకాలం కళా సేవ చేస్తూనే వుండాలని నా కోరిక. చాలా కొద్ది మంది వ్యక్తులు భిన్నభిన్నరంగాల్లో సేవచేసి ప్రజాదరణ పొందుతారు. అట్టివారిలో నా చిరకాల మిత్రుడు శ్రీ సుంకర కనకారావుగారొకరు. లలితకళలు, సంఘసేవ, ప్రజల ఉద్యమాలు - ఒకటేమిటి, ప్రతి రంగంలో ఆయన కృషివుంది. విజయవాడ అనగానే ఆనాడు కాళేశ్వరరావుగారు, ఈనాడు కనకారావుగారు నాకు జ్ఞాపకం వస్తారు. ఎందరో పెద్దలు విజయవాడ కేంద్రంగా ఆంధ్రదేశానికి సేవ చేశారు. కృష్ణానది, ప్రకాశంబారేజి, కనకదుర్గగుడి, గాంధీపర్వతం, కనకారావుగారు విజయవాడలో మరపురాని మైలు రాళ్ళు. మిత్రులు కనకారావుగారి జన్మదినోత్సవ సందర్భంగా నా శుభాకాంక్షలు. నేటి యువలోకం ఆయన నుండి చాలా నేర్చుకోవలసివున్నది. ఆత్మీయులు, ప్రజాసేవకులు, కళాపోషకులు అయిన శ్రీ సుంకర కనకారావుగారికి జన్మదిన సన్మాన మహోత్సవం జరగడం మిక్కిలి ముదావహం. ఆయన ఒక విశిష్టమైన వ్యక్తి. నిజమైన నిజాయతీతో గూడిన రాజకీయవేత్త. కళాకారులందు అమిత ఆప్యాయత. ఒకరి బాగు వారికి పండగ. పరోపకార సద్బుద్ధిమంతుడు. తనని గూర్చి తనకు తెలియని హనుమంతుడు. నా చిన్నతనంలో నాకు మొట్టమొదటిసారి సన్మానం చేశారు. అప్పటి నుంచి సన్మానాల పరంపర నిరంతరం జరుగుతున్నదంటే ఆనాటి ఆయన సంకల్ప సిద్ధి. వారిని మన రాష్ట్రం సరిగా గుర్తించి వారిచేత సరియైన సేవలు చేయించుకోలేదనే చెప్పక తప్పదు. దాని వల్ల వారికేమీ లోటు లేదు. ఆరోగ్యంగా ఆనందంగా గడపాలి. ఇదినా శుభాభినందన సందేశం. శ్రీ కనకారావు నాకు అత్యంత ఆప్తులు. సోదరతుల్యులు. వారి వ్యక్తిత్వము, సామర్థ్యము, వారు వివిధ రంగాలలో చేసిన నిష్కళంక, నిష్కామ సేవలు జగమెరిగినవి. వారు పొందవలసిన పదవులను పొందలేదనే చెప్పాలి. దానివల్ల లోపం వారికి కాదు దేశానికి. రాజకీయాలలో వుండవలసిన కొన్ని లోపాలు వారివద్దలేనందుననే, వారు రాజకీయ జీవితంలో ముఖ్యపాత్రలు నిర్వహించే అవకాశం రాలేదు. అందువల్ల వారి ప్రతిభకు ఏమాత్రంలోపం లేదు. శ్రీ త్యాగరాజస్వామి వారికి దీర్ఘాయువు, ఆరోగ్యం, సకల సౌభాగ్యాలు ప్రసాదించాలని మన సారా ప్రార్థిస్తున్నాను.

- దాశరథి

* మిత్రులు శ్రీ సుంకర కనకారావుగారు రాజకీయ, సాంస్కృతిక రంగాల్లో చిన్ననాటినుంచి పరిచయం పెట్టుకొని, ఎంతో కృషిచేశారు. నిస్వార్థజీవి. ఒక కళాకారునిగా ఆయన్ను నేనెరుగుదును. కళాహృదయుడు. నా చిననాటి మిత్రుడు

- డా. అక్కినేని నాగేశ్వరరావు

* అరుణోదయకు నాకు జన్మ సంబంధం, అవినాభావ సంబంధం. దేశంలో మా అందరి కళాతపస్సు ఫలించి, కళా దేవి కళకళలాడడానికి మిత్రులు శ్రీ సుంకర కనకారావు మంచి స్ఫూర్తి. - **కొంగర జగ్గయ్య.**

* ప్రధాన కార్యరంగంగా ఆయన నాట్య నాటక సంగీత కళారంగాల్లో నిరంతరంగా చేస్తున్న కృషి సహృదయులందరికీ తెలిసినదే. నొప్పింపక, వీలయినంత వరకూ మెప్పించుకుని తిరిగే నా చిరకాల మిత్రులు శ్రీ సుంకర కనకారావు. - **డా. సి. నారాయణరెడ్డి**

* కనకారావు స్నేహ పాత్రుడు నిరాడంబరుడు, నిగర్వి, ఎవర్నీ నొప్పించడు. మంచి మనసున్న వ్యక్తి విజయవాడలో వ్యక్తిగా కనకారావు స్థాపించినన్ని సంస్థలు, సక్రమంగా నడిపిన సంస్థలు మరెవ్వరూ చేయలేకపోయా రనడం అతిశయోక్తికాదు. అలంకారంకోసం మాత్రమే పదవిలో వుండడు. విశ్రాంతి ఎరుగని కార్యకర్త. బహుముఖంగా, పలు సంస్థలకు సేవ చేసినా హుందాగా వ్యవహరించిన వ్యక్తి. ఈనాడు పదవుల్లో ఉన్న ఎం.పి.లు, ఎం.ఎల్.ఏ.ల కన్న ఎక్కువ సేవ చేసిన మంచి వ్యక్తి. - **డా. మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి**

* చిన్నతనంలోనే రంగస్థలం మీద పేరు తెచ్చుకొన్నారు. చిన్నప్పుడే టాన్సిల్స్ వచ్చి ఆపరేషన్ జరిగి తియ్యని గొంతుదెబ్బతినకపోతే గొప్ప రంగస్థల నటుడు అయ్యేవాడు. మంచి తబలా వాద్యకారుడు. కళారసపిపాసకుడు. కాబట్టి ఈ నాడు కళాజీవిగా రంగస్థల ప్రయోక్తగా రూపొందాడు. ఈయనలోని నటుడు మంరెందరో నటుల అవిర్భావానికి మూలకందమై దోహదం చేసింది. - **'వ్యాసవిశారద' తుర్లపాటి కుటుంబరావు**

* శ్రీ సుంకర కనకారావుకళారంగంలో చక్కని రసజ్ఞుడు. అరుణోదయా నాట్యమండలిని స్థాపించి, దాని పతాకం మీద ఒక చరిత్రను సృష్టించగలిగాడు. ఈనాడు సినిమా వినీలాకాశంలో నక్షత్రాలుగా వెలుగొందుతున్న కొందరు వ్యక్తులు ఆయన ప్రాపు వల్లనే అలా రూపు దాల్చగలిగారు. ఆంధ్ర నాటక కళా పరిషత్ ఆధ్వర్యాన ఆయన ఎన్నో యాగాలను, యజ్ఞాలను విజయవాడలో చేశారు. తనవద్ద కల్పవృక్షం కామధేనువు లేకపోయినా వేల సంఖ్యలో విస్తరాకులు లేపాడు. అజ్ఞాత వీరులందినీ నాటక కళా పరిషత్తులకు ఆహ్వానించి వారి మీదపట్టు శాలువలు కప్పాడు. ఒక్క మాటలో చెప్పాలంటే ఆయన ఒక వ్యక్తి కాదు. ఒక సంస్థ. - **డా. ఇంటూరి వెంకటేశ్వర్రావు**

* మన జీవితం మన కోసం కాదు. ఇతరుల కోసం లలిత కళల అభ్యుత్తోన్నతి కోసం. నా నాటకం డైలాగును నిజజీవితంలో నిరూపించిన నిజమైన మిత్రుడు శ్రీ సుంకర కనకారావు. మాయా మర్మం తెలీని సామాన్య వ్యక్తి. నాటకాలు ఆడినా, ఆడించినా, సంగీత సభలు నిర్వహించినా విధి నిర్వహణలో సైనికుడుగానే మిగిలాడాయన. - **రెంటాల గోపాలకృష్ణ**

* లలిత కళారంగానికి అనవరతరం సేవలు చేసిన శ్రీ సుంకర ప్రశంసనీయుడు. వృత్త రైల్వే జంక్షన్‌గానున్న విజయవాడను లలిత కళల సంగీత నాట్య జంక్షన్‌గా మలచిన సుంకర ధన్యజీవి. **- ఆవుల సాంబశివరావు**

* పలునాటక సంఘాలకు సెక్రటరీగా వుండి, ఎంతో డబ్బు ఖర్చుపెట్టి చాలామంది ఆర్టిస్టులకు స్ఫూర్తి నిచ్చేవాడు. నాటక కళాపరిషత్ స్క్రూటినీ జడ్జిగా వ్యవహరించేవాడు.
**- డా.యమ్. ఆర్. అప్పారావు**

* రమారమి 40 సంవత్సరాపాటు శ్రీ కనకారావు ఆంధ్రనాటక కళాపరిషత్‌లో నాకు సహచరులు. ఆయన దీక్ష కార్యదక్షతలు ప్రశంసనీయులు. **- వవల సూర్య చంద్రరావు**

* చిరకాల మిత్రులు శ్రేయోభిలాషి రంగస్థలానికి ఆయన సేవలు చిరస్మరణీయాలు. రాష్ట్రానికి ఆయన సేవలు చిరకాలం లభించాలని నా ఆకాంక్ష- **డా. ఎన్.టి. రామారావు**

* అరుణోదయ సంగీత నాట్యమండలి, హిందూస్తానీ సంగీత నాట్యమండలి వంటి ప్రముఖ సాంస్కృతిక సంస్థలను రూపొందించి ఎన్నో సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించడమే గాక, ఎంతో మంది కళాకారులకు ఆలంబనగా, ఆలనాబలంగా ఎనలేని సహకారాన్ని అందించారు. వ్యక్తిగా సహృదయత, వ్యవస్థకు చేయూత అందీయడం ఆయన స్వాభావిక లక్షణాలు. ఆయనను గౌరవించడం, సన్మానించడం అంటే సాంఘిక రంగానికి, కళారంగానికి గౌరవం, సన్మానం చేయడమన్నమాట. **- శ్రీమతి జమునా రమణారావు**

* మంచి మిత్రుడు, మంచి కళాకారుడు, కార్యదీక్ష, పట్టుదల గల ఆర్గనైజరు. అన్నిటికీ మించి స్వార్థం లేని మనిషి. ఈయన సేవలు కనీసం ఇంకా ౬౦ ఏళ్ళు వుంటే నాటక రంగ భవిష్యత్తు ఎలా వుంటుందో అని కళాకారుడుగా నేను భావనాలోకంలోకి వెళ్ళిపోతున్నాను
**- జె.వి. సోమయాజులు**

* శ్రీ సుంకర నేతృత్వంలో అరుణోదయ వారి 'పన్నా' నాటక ప్రదర్శన చూశాను. గొప్ప ప్రదర్శన. ఇలాంటి మంచి నాటకాలు మరెన్నో సుంకర ప్రదర్శించాలని నా ఆకాంక్ష
**- డా॥ నీలం సంజీవరెడ్డి**

* ఆం.ప్ర. సంగీత నాటక అకాడమీలో ఆర్థిక సంఘ సభ్యులుగా ఆయన నాకు ఎంతో సహకరించారు. మంచి వ్యక్తి, కార్యశీలి దక్షుడు, నా శుభాకాంక్షలు.- **డా॥ మర్రి చెన్నారెడ్డి**

* కాంగ్రెస్ పార్టీకి మిత్రులు శ్రీ సుంర కనకారావు ఎంతసేవ చేశారో, రంగ స్థల నాటకానికి సంగీత ప్రపంఆనికి అంతకంటే ఇను మిక్కిలి సేవ చెశారు. యువత ఆయన దగ్గర నుండి నేర్చుకోవలసింది చాలా వుంది. - కోట్ల విజయభాస్కరరెడ్డి

* 40 ఏళ్ళుగా నాకు పరిచయం వున్న వ్యక్తి శ్రీ సుంకర కనకారావు. సంగీత, రంగస్థల సేవల్లో కాకలు దీరిన కాంగ్రెస్ యోధుడు, విజయవాడలో ఆయన జయప్రదంగా నిర్వహించని కార్యక్రమం అంటూ లేదు. నాకు ఎంతో ఆప్తుడు. - జి. ఎస్. రాజు

* చిరునవ్వుతో, నిశ్శబ్దంగా కార్యక్రమాలను జయప్రదంగా నిర్వహించే కార్యకుశలుడు. చిరంజీవి సుంకర కనకారావు. సాంఘిక, సాంస్కృతిక రంగాల సేవలో నిష్ణాతుడు, నిండా మునిగినవాడు. - కవి సామ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

* అరుణోదయ నాట్యమండలి 1945 నుండి ఆదర్శప్రాయంగా కళాసేవ చేస్తున్నది ఈ మండలిని 58లో దర్శించాను. ఈ మండలి వారు భారతీయ కళలను నూతన మార్గములలో పోషించుచు, ఆంధ్రుల కళావైదుష్యమును పెంపొందింప చేయుచున్నారు. నా అభినందనలు. - బూర్గుల రామకృష్ణారావు

* మొదటినుండీ నా సహచరుడు, కళా, సాంస్కృతిక రంగాలతో పాటు, కాంగ్రెస్‌కు నిబద్ధమైన కార్యకర్తగా శ్రీ సుంకర కనకారావు నాకు ఆత్మీయుడు ,విశాలాంధ్రోద్యమంలో నాతోపాటు తీవ్ర కృషి చేసిన వ్యక్తి - అయ్యదేవర కాళేశ్వరరావు

* గత 60 ఏళ్లపైగా కళాసేవలోనూ, 50 ఏళ్లపైగా సంఘ సేవలోనూ నిమగ్నుడై, విజయవాడ నగర సాంస్కృతిక ప్రముఖుడుగా, ప్రతినిధిగా నిస్వార్ధసేవకు అంకితమైనవాడు శ్రీ కనకారావు. - కె.వి. గోపాలస్వామి నాయుడు

* కాంగ్రెస్ క్రియాశీల కార్యకర్తగా, లలిత కళల పురోభివృద్ధికి కృషిచేసిన సాంఘిక, సాంస్కృతిక కార్యకర్తగా శ్రీ కనకారావు నాకు బాగా పరిచయమున్న ప్రజ్ఞావంతుడు.

- కాసు బ్రహ్మానందరెడ్డి.

*. విజయవాడ పట్టణానికి ప్రశంసనీయమైన సేవలు చేసిన, చేస్తున్న ఉత్తముడు శ్రీ సుంకర

- డా.కె.ఎల్.రావు

* అరుణోదయ సంగీత నాట్యమండలి చేసిన కళాసేవ ప్రశంసనీయం. ఇంకా ప్రశస్తమయిన సేవ చేయాలని, చేస్తుందని, నా విశ్వాసం శ్రీ సుంకరకు అభినందనలు.

**- పాకాల రాజమన్నారు**

* కళలు ఆధ్యాత్మికతకు సోపానాలు. కళారంగం, నాదబ్రహ్మోపాసనా సేవలో శ్రీ సుంకర కనకారావు పునీతులయ్యారు. నా శుభాశీస్సులు **- డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్**

* సుంకర కనకారావు త్యాగం, నిస్వార్ధ సేవా తత్పరతలకు ప్రతీకగా చెప్పుకోదగిన వ్యక్తి. ఆంధ్ర రాష్ట్రంలో లలిత కళారంగానికి విశిష్టమైన సేవలు చేసిన కళాకారుడు.

**- పెండేకంటి వెంకట సుబ్బయ్య**

* ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక రంగాభివృద్ధికి యాభైపళ్లకు పైగా ఆంధ్ర సంగీత నాటక అకాడమీ ఆంధ్ర నాటక కళా పరిషత్, ఆంధ్రప్రదేశ్ నాటక అకాడమీల ద్వారా ఎనలేని సేవ చేసిన వారు శ్రీ సుంకర కనకారావు. **- మండలి వెంకట కృష్ణారావు**

* శ్రీ అరుణోదయ వార్షికోత్సవాల్లో రెండు సార్లు నేను పాల్గొనడం. పురోగతిని సమీక్షించడం జరిగింది. ఈ సంస్థ నిర్వాహకులు శ్రీ కనకరావు అక్షశుద్ధి, కార్యదీక్ష ప్రజ్ఞా ప్రాభవాలు సంస్థకు శ్రీ రామ రక్ష **- నార్ల వెంకటేశ్వరరావు.**



# Kalapraveena KANAKA RAO Patriot And Connoisseur

*By*
Kalasaraswati, Telugu Velugu
**Turlapati Kutumbarao**, B.A ,
"JOURNALIST"
VIJAYAWADA - 520 010

Sri Sunkara Kanaka Rao is not an individual but an institution. His silent, selfless, services in the fields of social, culture and politics since 1942 are commendable. Humility has been his greatest virtue. He never wooed for any covetable positions. His face wreathed in genial smiles, spread the message of service to people of all caste, creed and colour. Although he wrote no books he did many things worth writing. His flair for documentation since five decades is worth mentioning.

Sri Sunkara Kanaka Rao was born on 13th October 1923 in a middle class family at Vijayawada As Astrologers predict, October born always move with great people and do great things. Mr. Kanaka Rao moved with Mahatma Gandhi, Subhas Chandra Bose, Lal Bahadur Sastry, Jaya Prakash Narayan, Jawaharlal Nehru, Smt.Indira Gandhi, Morarji Desai, Prakasam Pantulu, Kamaraj Nadar, Dr. Pattabhi Seetaramaiah etc. He earned name and not money. He never utilised the opportunities he got, his selfless services did not pay him dividends.

At the age of thirteen he plunged into the field of Fine Arts and after six years he entered politics, having been inspired by Mahatma Gandhi's Quit India Movement in 1942, is very active in the field of politics, arts and social services Mr. Kanaka Rao is self-made man

**Dinstinguished Persons who participated in his Social, Culture and Political activities :**

On the political field he had contacts with stalwarts like Mahatma Gandhiji, Jawaharlal Nehru, Smt. Indira Gandhi, Rajeev Gandhi, Sir.S Radhakrishna, V.V. Giri, Babu Rajendra Prasad, Lal Bahadur Sastry, Pandit Govinda Vallabh Pant, Babu Jagjeevan Ram, Dr. Bhogaraju Pattabhi Seetharamaiah, Dr.N. Sanjeeva Reddy, Sri R. Venkatraman, Sri Shankar Dayal Sharma, Sri P.V. Narasimha Rao, (P.M ) Prakasam Pantulu, Dr.B.Gopala Reddy, Burgula Ramakrishna Rao, Dr K.L. Rao, Kamaraj Nadar, P.V. Rajamannar, T. Anjaiah, Jalagam Vengala Rao, Kala Venkata Rao, Kasu Brahmananda Reddy, Ayyadevara Kaleswara Rao, Justice Kanda Bheema Sankaram, Justice Avula Sambasiva Rao, Sri K. Vijayabhaskara Reddy, M.L. Potedar, Vavilala Gopala Krishnaiah, Madhav Rao Scindia, V. N. Gadgil, Ajit Kumar Panja, P.V. Rangaiah Naidu, Kamaluddin Ahmad, M.R. Appa Rao, G. Venkataswami, Era Anbarasu, Pendekanti Venkata Subbaiah, P. Siva Sankar, V.B. Raju, K. Rosaiah, Kona Prabhakara Rao, P. Upendra, Vadde Sobhanadreeswara Rao, G.S. Raju, K.P. Reddaih, Dr. Mallu Ravi, Prof. N.G. Ranga, Dr.M. Chenna Reddy, N. Janardhan Reddy, Nadella Bhaskara Rao, Bhavanam Venkatram and host of other luminaries on the firmament of politics.

Satavadhani Challapalli Venkata Sastry, Pingali Laxmi Kantam Kavi, Kavisamrat Viswanadha Satyanarayana, Gurram Jashuva, Dr Chilukuri Narayana Rao, Vedanta Kavi, Jandhyala Papaiah Sastry, Jammalmadaka Madhavarama Sarma, Narla Venkateswara Rao, Tripuraneni Gopichand, Jonnalagadda Satyanarayana, L.V. Prasad, H.M. Reddi, B.N. Reddy, Chittor V Nagaiah, Addanki Sree Rama Murthy, S.V. Ranga Rao, P Suri Babu, N.T. Rama Rao, Akkineni Nageswara Rao, K. Jaggaiah, Savithri, Jamuna, Waheeda Rehman, Dr.P. Bhanumathi, Hemamalini, Yamini Krishnamurthy, Prof Vinayaka Rao, Patwardhan, J.L. Renade, Pandit Narayan Rao Vyas, V. Santharam, Pruhdviraj Kapoor, Ravi Shankar, Roshnnara Begum, Bade Gulam Allikhan, Amba Prasad, Shaik Davood, Pandit Jes Raj, Parupalli Ramakrishnaiah Pantulu, Dr.M.Bala Murali Krishna, Padmasri Stanam Narasimha Rao, Banda Kanaka Lingeswara Rao, Prof. Dwaram Venkataswami Naidu, Ustad Bismilla Khan, S.S. Vasa, Praveen, Sultana, Acharya Atreya, Sundarlal

